HCLM

# పార్వతీ కల్యాణము



155
2-74

మూలము : శ్రీశ్రీశ్రీ గోస్వామి తులసీదాసు గారు

అనువాదకుడు : రామనారాయణ శరణ్

పరిష్కర్త : శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రి గారు
సీనియర్ తెలుగు పండితులు (రిటైర్డు)
గురవయ్య హైస్కూలు - గుంటూరు.

Acc No 20263

ప్రథమ ముద్రణ : మే 94

ప్రతులు : 1000

మూల్యము : 8-00

మూలము : శ్రీరామచరితమానసము

అనువాదకుడు : రామనారాయణశరణ్

ప్రతులు దొరుకుచోటు :
**రామనారాయణ శరణ్**
విద్యానగరు, రింగ్‌రోడ్,
గుంటూరు – 7

ముఖ చిత్రకారుడు :
**దేవిశెట్టి కృష్ణారావు**
తెనాలి.

ముద్రణము :
**కమల ఆర్ట్సు ప్రింటర్స్**
ప్రొప్రయిటర్ సుధాకర్‌గారు
తెనాలి.

శ్రీరామ జయరామ జయ జయరామ

**గణపతి ప్రార్థన :**

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥

**గురు ప్రార్థన :**

శ్రీరామశరణ గురు రక్షమాం।
శ్రీరామశరణ గురు పాహిమాం॥
గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుసాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః॥

**ఇష్టదేవతా ప్రార్థన :**

అతులిత బలధామం స్వర్ణశైలాభదేహం
దనుజవన కృశానుం జ్ఞానినా మగ్రగణ్యాం
సకలగుణ నిధానం వానరాణామధీశం
రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి॥

గోష్పదీకృత వారాశిం।
మశకీకృత రాక్షసమ్॥
రామాయణ మహామాలా।
రత్నంవందే ఽ నిలాత్మజమ్

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్॥
బాష్పవారి పరిపూర్ణలోచనం।
మారుతిం నమతరాక్షసాంతకమ్॥

మనోజవం మారుత తుల్యవేగం।
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టం॥
వారాత్మజం వానరయూథ ముఖ్యం।
శ్రీరామదూతం శిరసానమామి.

# ఆ శీ స్సు లు

శ్రీ ఆంధ్ర తులసి, శ్రీ రామచరితమానసవ్యాస, భక్త ధ్రువ తార శ్రీ బెజవాడ రామనారాయణ శరణుని గూర్చి ఎంత వ్రాసినను అల్పమే యగును. నేను తణుకు షుగరు ఫ్యాక్టరీలో శ్రీరామచరిత మానసను 40 దినములు ప్రవచన మొనర్చితిని. మా ముఖ్య శిష్యుడగు శ్రీరామనారాయణ శరణ్ ఆ 40 దినములు ముఖ్య శ్రోతగా నుండెను. అప్పటికతనికి హిందీ అక్షరాలు కూడ రావు. అచ్చట కాలక్షేపమై యింటికి రాగానే ఇక ఆ గ్రంథమును గూర్చియే వ్యాసంగము చేసెడువారము. రాత్రి 12 గంటల వఱకు నిద్రపోనిచ్చెడు వాడుకాడు. అతని మేధాశక్తి యెట్టిదోగాని ఆ 40 దినములలో రామచరిత మానసములోని విషయము నంతను అగస్త్యుడు సముద్రమును పుక్కిట పట్టినట్లు పుక్కిట పట్టినాడు. హిందీ విశారద పరీక్ష యందుత్తీర్ణులైనవారును రామచరితమానసను బాగుగా అవగాహనము చేసికొనజాలరు. అట్టి దాని నల్పకాలము లోనే ఆ గ్రంథము ననువాదము చేయుటకు కడంగెను. అనువాదము చేయుటయేకాదు అచ్చొత్తించినాడు. ప్రచారమును జేసినాడు. అది సామాన్యునకు సాధ్యమయ్యే పనిగాదు ఆయనువాద మతని మేధాశక్తికి తార్కాణము అతడా గ్రంథమునే గాక హనుమద్భక్తుడగుటచే హనుమంతుని గూర్చిన గ్రంథములను వ్రాసినాడు. అతడు స్వాభావికముగ హనుమద్భక్తుడు. నేను బళ్లారిలో తులసీ రామాయణమును ప్రవచనము చేయుచున్నప్పుడును 40 రోజులు నా దగ్గఱనే ఉంటూ అచ్చట నున్న కామధేనువు పాలు ద్రావుచు మనుమన్మంత్ర పురశ్చరణ మీషద్వ్రానుష్ఠానమును గావించి హనుమదనుగ్రహమునకు పాత్రుడైనాడు. ఇది అతని నిష్కల్మష భక్తికి నిదర్శనము.

ఆతడు మేధావి, భక్తుడే కాదు, నిరాడంబరుడగు ప్రచారకుడు పైకి పొంగని ఉపన్యాసకుడు, హనుమాన్‌చాలీసాను అచ్చుటచ్చుట కేంద్రములలో సంకీర్తన చేయించుచు హనుమద్భక్తిని ప్రచారమును చేయుచుండెను. తాను స్వయముగ సుమారు వెయ్యి హనుమన్మూర్తులను శ్రీరామ నామముతో వ్రాసి, భక్తి లేనివారి కర్పించి భక్తి బీజములను నాటుచుండెను. అప్పుడప్పుడు దరిద్రనారాయణులకు అన్నదానము చేయుచుండును. అట్టి మేధావి, భక్తుడు, అన్నదాత, నిరాడంబరుడు ఇప్పుడీ పార్వతి కల్యాణము వచనములో వ్రాసి ప్రజల కందించుట చాలా ఆనందముగనున్నది. ఆతడింక మునుముందు కూడ ఇట్టి భక్తి యుక్తములగు పుస్తకములను వ్రాసి శ్రీ ఆంజనేయుని అనుగ్రహమునకు పాత్రుడు కావలెనని నా ఆశయము.

శ్రీ రామ శరణ్

16-4-94

# భూమిక

1975 సం॥లో శ్రీ రామనారాయణ శరణ్‌గారు శ్రీరామచరిత మానసము తెనిగించటం సుందరకాండతో ప్రారంభించారు. సుమారు 20 సం॥ నుండి ఆధ్యాత్మిక రచనా వ్యాసంగములో సమాజానికి సేవ చేస్తున్నారు. శ్రీ రామశరణ్ గురుదేవులు తణుకులో తులసీ రామాయణ ప్రవచనం చేయుచుండగా వారి వద్దనే వుండి గురు సేవ చేస్తూ, హిందీలో అక్షరాలు కూడా అభ్యసించనప్పటికి, ఆ భాషనంతా పుక్కిట పట్టి, హిందీ పండితులకు కూడా కొరుకున పడని శ్రీ రామచరిత మానసమును సరళమైన భాషలు సామాన్యు డికి కూడా అర్థమయ్యేట్లు తెనుగు చేసిన ఘనత శ్రీ రామ నారాయణ శరణ్ గారికి దక్కినది. ఇది కేవలం గురుకృపా కటాక్షమే!

ప్రస్తుతము "పార్వతీ కళ్యాణము" ఇది వరకు తెనుగు చేసినదే. అయితే "చౌపాయి" లేకుండా కేవలం వచనం మాత్రమే తీసుకున్నారు. రామాయణంలో పార్వతీ కళ్యాణ మేమిటని ? సందేహము రావచ్చును.

సీతాపహరణం జరిగిన తర్వాత రాముడు విరహబాధతో "హే సీతా ! ఎక్కడున్నావు ?" అని విలపించసాగాడు. అపుడు పార్వతీపరమేశ్వరులు ఆకాశ మార్గమున పోతూ శివుడు రామునికి నమస్కరించటం, అది చూచి సతీదేవి ఆక్షేపించటం, రాముడు భగవంతుడైతే సీత ఎక్కడ వుండేది తెలియదా ! అని పరీక్షించు టకు సీత వేషంలో వెళ్ళగా, రాముడు ఆమెకు సాష్టాంగపడి "అంబా ! శివుడెక్కడ ?" అని అడగటం దానితో ఆమెకు రామ తత్త్వం బోధపడటం. వెనుదిరిగేసరికి సృష్టి అంతా సీతారాముల

మయమై పులకితగాత్రయై తిరిగి శివుడి దగ్గరకు వెళ్ళి, నేను కూడా నమస్కరించి వచ్చానని అసత్యం చెబుతుంది. ఇదంతా గమనించిన శివుడు ఆమె తనకికా భార్యగా వుండతగదని ధ్యానములో వుండిపోవటం, తర్వాత దక్షయజ్ఞంలో సతీదేవి యోగాగ్నితో శరీరాన్ని దహించుకొని, మరల హిమవంతుని పుత్రికగా జన్మించి శివుని గూర్చి తపస్సు చేసి చివరికి శివునితో కళ్యాణము జరగటం. రామాయణంలో ఇదే పార్వతీ కళ్యాణం శివుడు జపించేది రామ నామమే. కనుక రామాయణంలో పార్వతీ కళ్యాణం ఒక విశిష్ట కథా సంవిధానం.

కేవలం గ్రంథ రచనయేగాక శ్రీ రామనారాయణ శరణ్‌గారు రామాయణములో ఆంజనేయస్వామి పటములు వేసి ప్రజల కందిస్తున్నారు. ఇప్పటికి 1000 పటములు వేశారు. ఈ విధంగా రామ నామాన్ని ప్రచారంచేస్తున్న ధన్యజీవులు ఇది ఒక ప్రపంచ రికార్డు అనుటలో ఏ మాత్రము సందియము లేదు.

పార్వతీ పరమేశ్వరులు వీరికి ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి వీరి గ్రంథ రచన ఇంకా ఇంకా ముందుకు సాగాలని నా ఆకాంక్ష.

యం. వి. నరసింహారావు
లేబరు ఆఫీసరు, గుంటూరు
అధ్యక్షుడు
శ్రీ రామ శరణ్ సేవా సంఘం,
బుద్దాం.

శ్రీరామ జయరామ జయ జయరామ

# కృతజ్ఞతలు

కళాసరస్వతి, విద్యావాచస్పతి

భాగవతచరిత వ్యాస, శ్రీరామశరణు సద్గురు మహోదయుల ఆదేశానుసారముగ శ్రీశ్రీశ్రీ గోస్వామి తులసీదాసుగారిచే రచింపబడిన "శ్రీ రామచరిత మానసము"లో గల "పార్వతీ కల్యాణము" అను ఘట్టమును వచనరూపమున సర్వులకు తెలియునట్లు సరళమగు భాషలో వ్రాయుట జరిగినది. శ్రీశ్రీశ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారు నేజేసిన అనువాదములో గల తప్పులను సరిదిద్ది ముద్రణకు తయారుగావించిరి. వారి మేలు మరువలేను.

ఈ గ్రంథమునకు కావలసిన పేపరును సప్లయి చేసిన ఆంధ్రా పేపరుమిల్సు ఛీఫ్ వెల్ ఫేర్ ఆఫీసరు యస్. బి. చౌదరి గార్కి, ముద్రణకు సహకరించిన శ్రీ యం. వి. నరసింహారావు గారికి, శ్రీ సూదాని కోటేశ్వరరావు గారికి, శ్రీ సూదాని యోగానంద శ్రీనివాసరావుగారికి, మిగిలిన కార్యకర్తలకు నా హృదయపూర్వక నమస్కారములు.

పార్వతీ కల్యాణముఖ చిత్రమును అందముగ గీచిన ఆర్టిస్టు శ్రీ దేవిశెట్టి కృష్ణారావుగారికి నమస్కారములు చేయుచున్నాను.

"ఆంధ్ర తులసి"
"శ్రీరామచరిత మానసవ్యాస"
**రామనారాయణ శరణ్**

శ్రీ గణేశాయ నమః

శ్రీరామ జయరామ జయ జయరామ

# పార్వతీ కల్యాణము

(శ్రీరామచరిత మానసాంతర్గతం)

శ్రీ శ్రీ గోస్వామి తులసీదాసు

గణములకు అధిపతియు, ఏనుగు తల గలిగినవాడు, అష్ట సిద్ధులకు సర్వ సద్గుణములకు నిలయుడు, ఆది దంపతులగు పార్వతీ పరమేశ్వరులకు ముద్దుబిడ్డడు అగు శ్రీ గణపతిదేవునకు, చదువులకు తల్లి, సృష్టికర్తకు అర్ధాంగియునగు శ్రీ శారదామాతకు, నాకు మంత్రదీక్ష నొసంగిన శ్రీరామ సాక్షాత్కారము పొందిన "భాగవత చరిత వ్యాస్" "పాకయాజి" శ్రీరామశరణు సద్గురు మహరాజుల వారి పాదపద్మములకు నమస్కరిస్తూ శ్రీశ్రీశ్రీ గోస్వామి తులసీదాస కృత శ్రీరామచరిత మానసములోని శ్రీ పార్వతీ కళ్యాణమును పెద్దలు చెప్పిన విధముగ తెలుగు గద్యములోనికి అనువదించు చున్నాను. ఆపైన నా యిలవేల్పు శ్రీ సీతారామాంజనేయమూర్తిపై భారమువేసి వ్రాయుట కుపక్రమించుచున్నాను.

పూర్వకాలమున ఒకానొక మాఘమాసమున త్రివేణీసంగమము (ప్రయాగ) లో యాజ్ఞవల్క్య భరద్వాజ మహర్షులు కలిసికొనిరి. స్నాన జపాదులు ముగించుకొని త్రివేణీ మాధవుని దర్శించిరి. వారుభయులు చేయు సత్సంగములు భరద్వాజ మహర్షి యాజ్ఞవల్క్య మహర్షి నిట్లడిగినాడు.

ఓ మహర్షీ ! ఆది దంపతులగు పార్వతీ – పరమేశ్వరుల కల్యాణమును గూర్చి సవివరముగ చెప్పవలసినది. ఆ దివ్యము,

సుందరమునగు కథను నేను విని తరించుదును. నాతోపాటు దీనిని చదివినవారు, విన్నవారు తరించెదరు. భగవంతుని అనుగ్రహము నకు పాత్రులయ్యెదరు.

ఓ భరద్వాజా! నీవడిగినట్లు నాకు తెలిసినంతవరకు తెలుపుదును. నీ సందేహములు తొలగును. జాగ్రత్తగ వినుము.

త్రేతాయుగ మందొక పర్యాయము శంకర భగవానుడు మహాముని యగు అగస్త్యుని జూచుటకు వెడలినాడు. శంకరునితో పాటు జగజ్జనని సతీదేవి గూడా ఉన్నది. ఆది దంపతులను ఆ మహర్షి పూజించి శ్రీరామ నామ మహత్తు రామ తత్త్వసారము తెలిసినవాడగుట వలన అద్దాని మహత్త్వమును సవిస్తరముగా వినిపింప శంకరుడెంతగనో ఆనందించాడు.

అంతట "ఋషిపూఛీ హరిభగతి సుహాఈ" అగస్త్యులవారు శ్రీహరి తత్త్వమును గూర్చి విపులముగ తెలుపుడనికోర శివుడానందించి కొన్ని దినములు ఆ ఆశ్రమము నందుండి సవివరముగ వివరించి హరి తత్త్వమును తెలిపినాడు. ఋషివర్యు లానందించారు. సతీసమేతుడై శివుడు కైలాసమునకు వెడలినాడు. సాంబసదా శివుడు చెప్పిన ఆ శ్రీహరి తత్త్వమును విన్నవారెల్లరు మిక్కిలిగ సంతోషించారు.

ఆ దినములలో భూభారమును హరించుటకై శ్రీమన్నారాయణ మూర్తి రఘు వంశమందు దశరథ–కౌసల్యలకు పుత్రుడుగ జన్మించాడు. తండ్రి మాట ప్రకారము అయోధ్యా రాజ్యమును త్యజించి తాపస వేషమును ధరించి దండకారణ్య రాజ్యములో ప్రవేశించి సంచరించుచు ఋషులను దర్శించుచుండ సృష్టి స్థితి లయ కారకుడగు శ్రీరామచంద్ర భగవానుని దర్శనము ఎట్లు లభించునా

యని గుప్తరూపమున వెడలుచుండ ఎవరును గుర్తింపలేకుండిరి. అర్ధాంగియగు దాక్షాయణికి శివుడుపడు తాపత్రయమును గూర్చి తెలియదు. అతడు రెప్పలు వేయక శ్రీరామ సాక్షాత్కారము కొరకు ఎదురు చూచుచున్నాడు.

మానవునిచే జచ్చునట్లు రావణునకు బ్రహ్మ వరమిచ్చాడు. ఆతడిచ్చిన వరమును శ్రీమన్నారాయణమూర్తి సత్యముగావింప వలెను. ఇది గమనించి శివుడు అటునిటు తిరుగుచు శ్రీరామచంద్ర మహరాజు నెట్లు దర్శింతునా ? ఆలోచించుచుండ అదే సమయ మున రావణుడు మారీచుని వెంటనిడుకొని వెడలుచూ ఓ మారీచా! నీవు మాయా మృగానివికమ్ము. అటునిటు ఈ ప్రాంతమున సంచరింపుమని పలుక వాడు భయపడి అట్లే చేయుచుండెను.

సీతాదేవి ఆ మాయా మృగమును పట్టిమ్మని శ్రీరాముని కోరినది. దానిని పట్టుకొనుటకు వెడలినాడు శ్రీరామ-లక్ష్మణులు ఈ సమయమున లేరు. సీత యొంటరిగా నున్నది. రావణు డామెను మోసగించి లంకకు తీసుకొని వెళ్లాడు

మాయా మృగమును సంహరించి శ్రీరామ లక్ష్మణు లిరువురు ఆశ్రమమునకు వచ్చిరి. అందు సీతాదేవి లేకుండుటచే మిక్కిలిగ దుఃఖించిరి. శ్రీరాముని నేత్రముల వెంట కన్నీరు వరదవలె స్రవించసాగినవి. మానవులవలె భార్య లేకుండుటచే విరహబాధ పడుచున్నట్లు నటించినాడు. ఆతనికి సీతతో సంయోగముగాని, వియోగముగాని లేదు. జూచువారలకు విరహబాధ చెందుచున్నట్లు శ్రీరాముడు కన్పింపసాగాడు.

శ్రీ రఘురాముని లీలలు జూచువారలకు ఆశ్చర్యముగ నుండెను. భక్తులకు, జ్ఞానులకు మాత్రము వారి లీలా వినోద

ములు తెలియును. అజ్ఞానులు మాయా మోహమున జిక్కు కొనుటచే హరి మహిమలు తెలియలేదు.

శివుడు శ్రీరాముని దర్శించుటచేత కన్నుల వెంట ఆనంద బాష్పాలు స్రవించసాగినవి. కంఠము గద్గదికమైనది. తన్మయత చెందాడు. సమయమునను సరించి శ్రీరాముని వద్ద కెడలి మౌనముతో నిలుచున్నాడు. అచ్చట నుండి వెడలునపుడు "శ్రీరామ జయజయ" అని పలికి సతీదేవిని వెంటనిడుకొని సంతోషముతో కైలాసగిరికి బయలుదేరినాడు.

శ్రీరాముని దర్శించుటచే శివుడానందపరవశుడై యుండ సతీదేవి జూచి సందేహము గలదై మనస్సు నందిట్లాలోచించు కొన్నది. "దేవతలు, గంధర్వులు, కిన్నరులు, నాగులు, మునులు, ఋషులు శివునకు నమస్కరిస్తారు గదా ! ఈయన ఒక్క రాజ పుత్రుని జూచి సచ్చిదానంద స్వరూపుడని పలికి నమస్కరించా డేమి ? అతనిని జూచి తన్మయుడైనాడే. ధ్యానములో మునిగి కూర్చున్నాడు. సర్వవ్యాపకుడు, మాయారహితుడునగు వానిని గూర్చి వేదములే చెప్పలేకపోయినవి. అట్టి భగవానుడేల మానవ శరీరమును ధరించెను ? సచ్చిదానందుడెట్లాయెను ?

దేవతా గణములకు ఉపకారము చేయుట కొరకు, దుష్టుల శిక్షించుటకు, భక్తుల, సాధువుల రక్షింపుట కొరకు ఆ శ్రీమన్నారాయణ మానవ రూపమును ధరించెనా ? జ్ఞాన సముద్రుడు, లక్ష్మీ పతియునగు భగవానుడు కాముకునివలె ఏల రోదనజేయుచు స్త్రీని వెదకికొనుచున్నాడు ? శివుడు సర్వాంతర్యామి. సమస్త మెరిగిన వాడని అట్టి వాడేల అసత్యము పలుకునని, సతీదేవి మనస్సున అనేక విధములుగ అనుమానములు ఉత్పన్నమయినవి. అందు

వలన ఆమెకు జ్ఞానోదయము గలుగలేదు. ఆవిడ మనోభావములు శివుడు గ్రహించి దాక్షాయణీ! నీది స్త్రీ స్వభావము గనుక సందేహ ములు మెండుగ నున్నవి.

దాక్షాయణీ ! ముని శ్రేష్టుడగు అగస్త్య మహాముని ఎవని కథను మనకు వినిపించెనో ఆ అవతారుడే ఈ శ్రీరాముడు. భక్తులు, జ్ఞానులు, మునులు వీరి సేవ సర్వకాలములలో జేయుచుందురు. ఏ పరబ్రహ్మ స్వరూపమును వేదములు, పురాణములు, ఉపని షత్తులు, భారత, భాగవత, రామాయణాది గ్రంథములు కీర్తించి, వర్ణింపజాలకుండెనో, మాయాతీతుడు, నిత్యుడు, పరబ్రహ్మ, పరమ స్వాతంత్రుడునగు భగవంతుడే బ్రహ్మయే శ్రీరాముడుగ అవతరించి భక్తుల కోర్కెలు తీర్చుచున్నాడు. అని శివుడు ఎన్ని పర్యాయములు చెప్పినను ఆమెకు తత్త్వరహస్యములు అర్థము గాలేదు. సందేహము పోలేదు. ఇదంతయు మాయా ప్రభావమని శివుడు తెలిసికొని నవ్వుకున్నాడు.

## సతీదేవి శ్రీరాముని పరీక్షించుట

ఓ సతీ ! నీ మనస్సులో గల సందేహమును పోగొట్టు కొనుము. వారి నెట్లు పరీక్ష చేయవలెనో అట్లు చేసిరమ్ము. నీవు వచ్చువరకు నేని మఱ్ఱి చెట్టు నీడన కూర్చుండి యుండెదను. నీలో గల భ్రమను, మోహమును పోగొట్టుకొనుము. అని శివుడు పలుక దాక్షాయణి శ్రీరాము నెట్లు పరీక్షింపవలెనో ఆలోచించుకొన సాగినది. దక్షుని పుత్రికయగు సతీదేవికి శుభములు గలుగవని ఎంత చెప్పినను వినలేదని, విధి వ్రాత విపరీతముగ నుండుటచే ఆమెకు మంచియు చెడుగ దోచుచున్నదని భావించుకున్నాడు.

శ్రీరామానుగ్రహము ఎట్లుండిన అట్లే జరుగునని తర్క వితర్కములతో పని యేలనని భావించి శ్రీహరి శ్రీహరి శ్రీహరి యని స్మరించుకొనసాగెను. సుఖధాముడు, ఆనందరాశియునగు శ్రీరాము డున్న ప్రదేశమునకు సతీదేవి బయలుదేరి వెడలినది.

సతీదేవి వివిధోపాయముల నాలోచించి జగన్మాత సీతామాత రూపమును ధరించి భక్తోద్ధారకుడు, దీనజన బాంధవుడునగు శ్రీరాముడు వచ్చు మార్గమునకు ఎదురుగారాసాగినది. లక్ష్మణు డామెను జూచి సీతయని భావించి ఆశ్చర్యమును జెందినవాడై ప్రకటి తమునుగానీయక గంభీరుడై మౌనమును వహించినాడు. శ్రీరామ చంద్రుని ప్రభావము లక్ష్మణునకు బాగుగా దెలియును.

సర్వజ్ఞుడు, స్మరణమాత్ర సంతుష్టుడు, అజ్ఞానమను కారు చీకట్లను పారద్రోలువాడు, సర్వజీవుల హృదయాలలో నుండువాడు నగు శ్రీరామచంద్రుడు సతీదేవి సీత వేషము వేసికొని వచ్చు చున్నట్లు తెలిసికొన్నాడు. ఆమె భగవంతునే మోసము చేయదలచె గదా! శ్రీరాముడు తన మాయాబలమును దెలిసికొని మృదువగు మాటలతో సతీదేవితో యిట్లు పలికినాడు.

**అమ్మా**! నేను దశరథుని పుత్రుడను శ్రీరాముడను. నీకు రెండు చేతులు ఎత్తి నమస్కరించుచున్నాను. నా తండ్రి పరమ శివుడెక్కడ? ఈ దట్టమగు కీకారణ్యమున ఒంటరిగ ఏల సంచ రించుచున్నావని మృదువగు మాటలతో ఆమెను ప్రశ్నించాడు. ఆ సుందరములగు మాటలు వినుటచే శ్రీరాముడు తన్ను గుర్తించా డని సంకోచించి శివుని వద్దకు వెడలుచుండ ఆమె హృదయమున వివిధ విధములగు ఆలోచనలు రాసాగెను.

శ్రీరామచంద్రుని ప్రభావమును, గొప్పతనమును గూర్చి శంకరభగవానుడు చెప్పినను నేను వినుపించుకొనక అజ్ఞానుడని ఆరోపించితిని. నేనాతని వద్ద కెట్లు వెడలగలను ? నే వెడలిన పరీక్షించితివా ? ఎట్లు పరీక్షించితివని యడిగిన నేనేమి చెప్ప గలను ? అని బాధపడుచుండెను. సృష్టి, స్థితి, లయ కారకుడగు శ్రీరాముడు సతీదేవి బాధపడుట జూచి తెలిసికొని తన ప్రభావము నామెకు జూప నిశ్చయించుకొని ఆమె వెడలు మార్గమున సీతా లక్ష్మణు సహితుడై శ్రీరాముడు వచ్చుచున్నట్లు జూచెను. ఈ దివ్య రూపమును జూచి సతీదేవి ఆశ్చర్యచకితురాలైనది. ఆమె వెనుదిరిగి జూడ సీతారామ లక్ష్మణులే కన్పింపసాగిరి. ఋషులు, మునులు, భక్తులు, దేవగణములు శ్రీరామునకు సేవలు జేయుచుండుట ఆమె జూచి ఆమె ఆశ్చర్యము జెందినది. అనేక వేల బ్రహ్మల, విష్ణుల, శివులను సతీదేవి అచ్చట జూచెను. దేవతలు, యక్షులు, కిన్నరులు శ్రీరామునకు నమస్కరించుచు సేవలు జేయుచుండుట ఆమె జూచినది.

దేవతలెల్లరు వివిధ శరీరములు ధరించి శ్రీరామచంద్రునకు సేవలు జేయుచు శ్రీహరి రూపమునే జూచుచుండిరి. సతీదేవి తన భర్త వద్దకు వెడలుచుండ మార్గములో ఆమె ఎటువైపు జూచినను అనేక మంది సీతారాములు కన్పింపసాగిరి. అదే విధముగ బ్రహ్మలు, విష్ణువులు, మహేశ్వరులు గన్పించుచుండిరి ఈ జగత్తంతయు సీతారామమయముగ గన్పింప భయకంపితు రాలైనది. శరీరము స్వాధీనము దప్పినది. గుండె దడదడ కొట్టుకొనసాగినది. అడుగు ముందుకు వేయలేక కన్నులు మూసు కొని మార్గమందు కూర్చున్నది. కొంతసేపటికి ఆమె కన్నులు

దెరచి జూడ సీతారామలక్ష్మణులు అచ్చట గానరాలేదు. మాటి మాటికి ఆమె శ్రీరామచంద్రుని స్మరించుకొనుచూ, నమస్కరించుకొనుచూ శివుని సన్నిధికి బయలుదేరి వచ్చినది. పరమేశ్వరుడామెను దగ్గరకు దీసుకొని నవ్వుకొనుచు యోగక్షేమాలు విచారించి దాక్షాయణీ ! నీవు శ్రీరాముని ఎట్లు పరీక్షించితివో తెల్పుమని అడిగినాడు.

సతీదేవి శ్రీరాముని ప్రభావము యెరిగినదగుటచే భయము వలన శివుని వద్ద ఆ పరీక్షించిన విధానము చెప్పక నేను శ్రీరాముని పరీక్షింపలేదు. నేనచ్చటకు వెడలి నీవలె శ్రీరామునకు నమస్కరించితిని. నీవు చెప్పిన దానిలో అసత్యమేమియు లేదని పలికినది. సతీదేవి అబద్ధము చెప్పినట్లు జ్ఞాననేత్రముతో జూచి శివుడు తెలిసికొన్నాడు శ్రీరామునిచే ప్రేరేపింపబడిన మాయకు శివుడు నమస్కరించి అసత్యము పలికిన సతీదేవిని జూచాడు. సీత వేషము వేసనందులకు శివుడు బాధపడ్డాడు. ఆమె కోర్కెను నెరవేర్చవలెనని మహాదేవుడు నిర్ణయించుకున్నాడు. నేను ఈమెను పూర్వమువలె ప్రేమించిన భక్తిమార్గమునకు అన్యాయము జేసినవాడనగుదును. ధర్మమార్గమును దప్పరాదని నిర్ణయించుకొని శ్రీరామ ధ్యానమందు నిమగ్నుడై ఆమెతో నేమియు పలుకక హృదయమందు బాధపడసాగినాడు. అప్పుడు ఆకాశవాణి ఇట్లు పలికెను. మహేశా ! నీకు జయమగుగాక ! నీకు దప్ప యితరులెవ్వరు యిట్టి ప్రతిజ్ఞ జేయజాలరు. సర్వసమర్థుడవు. శ్రీరామభక్తుడవని ఆకాశవాణి పలుక సతీదేవి విన్నదై సిగ్గుపడి తన నాథునితో నిట్లు పలికెను.

దయాస్వరూపా ! సత్యవాక్పాలకా ! నీవేమి ప్రతిజ్ఞ చేసితివో తెలిసికొనగోరుచున్నాను. నన్ననుగ్రహించుము. అని పలుక

త్రిపురారి మౌనము వహించాడు. సర్వవ్యాపకుడగు శివునకు నే జేసిన కుకార్యము తెలిసెనని, నాపై అనుమానము గలిగినదని భావించింది. సహజముగనే నేను మూర్ఖురాలను. అందునా స్త్రీని. కపటముగ వ్యవహరించితిని. నీరు పాలల్లో గలిసిన అవియు పాల వలెనగును. సమాన భావమును జూపును. కపటమగు మజ్జిగ దాని యందు పోసిన రెండును విడివడి గడ్డకట్టుకొనిపోవును. అదే విధముగ కపటముతో స్నేహముజేసిన రాణించరు. మనసులు గలియవు. అని సతీదేవి బాధపడుచు, తను జేసిన అపరాధమును గుర్తుకు దెచ్చుకొని బాధపడసాగినది.

దాక్షాయణి శివుని బాహ్యరూపమును జూచి తనను పరిత్యజించినట్లు తెలిసికొన్నది. నేజేసిన తప్పులు తెలిసికొని నాతో పలుకుటలేదు. కుమ్మరివాని ఆములోని కుండలు రగుల్కొని కాలునట్లు ఆమె హృదయము మిక్కిలిగ బాధపడసాగినది.

మహేశ్వరుడు వెనుకటి శపథము ప్రకారము వటవృక్ష ఛాయ యందు పద్మాసనము వేసికొని ధ్యానావస్థలో నిమగ్నుడైనాడు. సతీదేవి మనస్సు బాధపడసాగినది. దినమొక యుగముగ గడుపుచున్నది. బాధలు బాధింపసాగినవి. విరహసాగరము నుండి ఎట్లు తరింతునా ? అని ఆలోచించసాగెను. నా భర్త మాటను అవమానపరచి శ్రీ రఘురాముని అవమానించితిని. అందులకు ఫలితము ఎట్టిదో బ్రహ్మ నాకు కలుగజేసినాడు. నా భర్తలేని నా జీవితము వ్యర్థము. మరణించుటయే శ్రేష్టము.

సతీదేవి హృదయబాధ చెప్పుటకు వీలులేకుండా ఉన్నది. అప్పుడు ఆమె భగవానుని స్మరించి దీనజనబాంధవా ! నన్ను

కాపాడుము. నా మనో వేదనను పోగొట్టుము. దయామయుడవని సర్వవిధములగు బాధలు పోగొట్టువాడవని వేదములు, పురాణములు. ఇతిహాసములు పలుకుచున్నవి. నన్నీదేహము నుండి వేరుచేయుమని వినయముగా ప్రార్థించుచున్నాను నాభర్తనే నేను నమ్ముకున్నదాని నగుదునేని నా ఈ కోర్కెను నెరవేర్చుము. ఓ సర్వాంతర్యామీ! నాకు శ్రమలేని మరణమును ప్రసాదింపుము. అని సతీదేవి ఎనుబది ఏడువేల సంవత్సరములు బాధపడినది. శివుడు సమాధి నుండి లేచి రామనామమును స్మరింపసాగెను. దాక్షాయణి కీవిషయము తెలిసినది. ఆమె భర్త వద్దకు వెడలి పాదములకు నమస్కరించెను. శివుడామెకు ఆసనమిచ్చి ఎదురుగా కూర్చుండుమని చెప్పెను. ఆమె కూర్చున్న తదుపరి శ్రీహరి కథలు వినిపింపసాగెను. ఆ సమయమున అన్ని విధముల యోగ్యుడైన దక్షుని ప్రజాపతిగా బ్రహ్మ నిర్ణయించెను. ఆ పదవి వచ్చుటచేత అతడు అభిమానముతో గర్వముతో విర్రవీగసాగెను. దక్షుడు ఋషులను ఆహ్వానించి యజ్ఞముచేయ మొదలిడెను. యజ్ఞభాగములకు అర్హులగు దేవతలను సాదరముగా నాహ్వానించెను బ్రహ్మ విష్ణు, మహేశ్వరులుదప్ప యక్షులు, కిన్నరులు, నాగులు, సిద్ధులు, గంధర్వులు, దేవతలు వారి వారి సతీసమేతముగను మరియు బంధు మిత్రులతో వాహనారూఢులై ఆకాశమార్గమున వెడలిరి. దేవతా స్త్రీలు మధుర స్వరములతో గానము చేయుచుండిరి. ఆ గాన మాధుర్యమునకు మునీశ్వరులకు తపోభంగము గలిగెను. సతీదేవి అట్లు వెడలుచున్న దేవతలనుగాంచి శివుని వద్దకు చేరి వీరెల్లరు ఏ కారణమున ఎచ్చోటకు వెడలుచున్నారని ప్రశ్నించెను.

మీ తండ్రి చేయు యజ్ఞమునకు వారెల్లరు తరలి వెళ్లుచున్నారని శివుడు పలికెను సతీదేవి తండ్రి చేయు యజ్ఞమును గూర్చి

విని ఆనందించినదై యిట్లనుకొనెను. మహాదేవుడు అజ్ఞ ఇచ్చినచో ఆ నెపముతోనైనను కొన్ని దినములు తండ్రిగారి యింటి వద్ద వుండెదను. కాని ఆమె హృదయములో భర్తవే విడువబడుదు నేమో యను భయముండెను. అందువల్ల ఆమె తన అపరాధమును దెలిసికొని ఏమియు మాటాడలేకపోయెను. చివరకు ఆమెలో భయము, సంకోచము, ప్రేమ ముప్పిడిగొనగా శివుని యిట్లు అడిగెను.

పరమశివా ! నా తండ్రి యింటిలో గొప్ప ఉత్సవము జరుగుచున్నది. దయతో నాకు అనుమతి నొసంగిన నేనచ్చటకు వెడలి ఆ యజ్ఞమును జూచెదను. అని పలుక దాక్షాయణీ నీవు మంచి మాటనే పలికితివి. నాకు సంతోషమే. నీ తండ్రి ఆ యజ్ఞమునకు మనలను ఆహ్వానింపలేదు గదా ! నిన్ను దప్ప కుమార్తెల నెల్లరను పిలిచినాడు. నాపై వైరభావ ముండుట వలన మనలను పిలువ లేదు. పిలువని చోటుకు వెడలుటకు నాకు సమ్మతము గాదు. దానికి కారణము చెప్పుచున్నాను వినుము. బ్రహ్మ సభయందు ఒక పర్యాయము మీ తండ్రి నాచేత అవమానింపబడినాడు. ఆ కారణము వలన నన్నిపుడు మీ తండ్రి అవమానము చేయుటకు గాను పిలువలేదు. పిలువని పేరంటానికి వెడలిన నీ శీలమును శంకించెదరు అవమానముపాలు జేయుదురు. మానమర్యాదలుండవు.

ఉమా ! స్నేహితుడు, రాజు, గురువుల యిండ్లకు పిలువక పోయినను పోవచ్చును. విరోధులుండు తావునకు ఆహ్వానము లేకుండ పోయిన యెడల అవమానము జరుగును. శుభములు జరుగవు. అని శివుడు ఎన్ని విధములుగ జెప్పినను దాక్షాయణి

వినలేదు. విధివిపరీతముగ నున్నది. నీవు నా మాటలు వినుటలేదు. నీవచ్చటకు వెడలుట నాకిష్టములేదు. దాక్షాయణి ఆగునట్లు లేదు. భృంగి, శృంగి అను శివగణములనిచ్చి తండ్రి చేయు యజ్ఞమునకు పంపినాడు. తండ్రి యింటికి చేరింది. తోబుట్టువు లెవరు ఆమెతో మాటాడలేదు. తల్లియు మౌనము వహించింది. సహోదరులు ఎదురుగవచ్చి నవ్వుకొనుచుండిరి. దక్షుడును సతీ దేవిని పలుకరింపలేదు. దక్షుడామె యోగక్షేమములు విచారింప లేదు. ఆమెను జూచుటతోడనే ఆపాదమస్తకము మండినది. ఆవిడ తండ్రితో మాటాడకయే ఆ యజ్ఞమును జూచుటకు వెడలింది. శివునకు చెందవలసిన హవిర్భాగములు ఆ యజ్ఞమునందు లేవు. శివుడు చెప్పిన విధముగనే తండ్రి యింట దాక్షాయణికి అవమానము జరిగినది. శివునకు ఆ యజ్ఞము నందు తగినస్థానము యివ్వకుండుటచే కోపావేశము ఎక్కువైనది. పరమేశ్వరునకు జరిగిన అవమానమును సహింపలేకుండెను. నాధుని మాటలు వినకుండా ఉండినందుకు తగిన ఫలితము లభించినది. ఆమె భర్తను అవమానపరచుటచే గలిగిన దుఃఖమును భరింపలేకుండెను. తన జాతివారు చేయు దుఃఖముల బాధలను సహింపలేక మిక్కిలి కోపము చెందినది. తల్లి మాత్రము ఆమెను ఓదార్చుచుండెను. తండ్రి అవమానము జేయుటచే తల్లియగు మేనా ఓదార్చుచుండ ఆమెకు ఆ మాటలు నచ్చుటలేదు. సభాసదుల నుద్దేశించి సభాసదులారా! మునీశ్వరులారా! పరమేశ్వరుని దూషించిన విన్న వారెల్లరు తగిన ఫలితము ననుభవించెదరు. సాధువులను, శివుని, లక్ష్మీనారాయణుని నిందించువారి నాలుకను గోయవలెను. లేదా చెవులు మూసికొని అచ్చట నుండి లేచిపోవలెను.

నా భర్త త్రిపురాసుర సంహారకుడు. పదునాలుగు భువనములకు ఆత్మస్వరూపుడు. సర్వజీవులకుశుభములు గలుగజేయువాడు. జగత్తులకు తండ్రి. అట్టి భగవానుని నా తండ్రి నిందించాడు. యజ్ఞాహుతుల నీయలేదు. దక్షుని వీర్యము వలన నా ఈ శరీరము సృష్టింపబడినది కనుక నేను దీనిని వెంటనే త్యజించెదను. చంద్రుని శిరమున ధరించినవాడు, వృషభవాహనుడు, సర్పములను ఆభరణములుగ ధరించినవాడు, పులి చర్మమును వస్త్రముగ ధరించినవాడు నగు నా భర్తను హృదయము నందు ధరించి, ధ్యాననిమగ్నురాలనై నా ఈ శరీరమును త్యజించెదనని సతీదేవి యోగాగ్ని యందు తన శరీరమును దహింపజేసినది. ఆ యజ్ఞశాలంతయు హాహాకారములతో ధ్వనింపసాగెను శివగణములు సతీదేవి మరణవార్తను విని ఆ యజ్ఞమును ధ్వంసము చేయసాగెను. భృగుమహర్షి ఆ యజ్ఞమును రక్షించుచు డెను. పరమశివునకు ఈ వార్త దెలిసినది. కోపావేశుడై వీరభద్రుని పంపాడు. అతడా యజ్ఞమును నాశనము జేయసాగెను. అందులో పాల్గొన్న దేవతలకు గూడా తగిన విధముగ దండన జరుగుచుండెను. శివద్రోహియగు దక్షునకు తగినశాస్తి జరిగినది. ఈశ్వర విముఖులైనవారు అధోగతిపాలే పొందుదురని దీనిని బట్టి తెలియుచున్నది.

## పార్వతి జననము

సతీదేవి మరణ సమయమున జన్మజన్మలకు శివుని పాదపద్మముల యందు అనురాగ ముండునట్లు పరమేశ్వరుని ప్రార్థించినది. హిమవంతునింట పార్వతిగ జన్మించినది. అందువలన పర్వతరాజు గృహమందు అష్టసిద్ధులు నివశింపసాగినవి. భక్తులు,

జ్ఞానులు, ఋషులు, ఆశ్రమము ఏర్పరచుకొని తపస్సొనరించుచుండిరి. హిమవంతుడు వారికి ఏ లోటులేకుండ యేర్పాట్లు చేయుచుండెను. అచ్చట సర్వకాలములలో పుష్ప ఫల భరితము లగు వృక్షములు శోభిల్లుచుండెను. పర్వతములలో దాగియున్న మణులు దేదీప్యమానముగ ప్రకాశించుచుండెను. నదులన్నియు నిర్మలములగు శీతల జలముతో ప్రవహింపసాగెను. పశుపక్ష్యాదులె గాక క్రిమికీటకాదులు ఆనందముగ సంచరించుచుండెను. జంతుజాలములు తమ వైరములను మరచి ఒకదాని నొకటి ప్రేమించుకొనుచు ఆ పర్వతసానువులలో తిరుగాడసాగినవి శ్రీరామ భక్తి ప్రభావముచేత భక్తుడు దేదీప్యమానముగ ప్రకాశించునట్లు పార్వతి జన్మించుట వలన హిమవంతుడు ప్రకాశించెను. ఆతని గృహము నిత్యకల్యాణము పచ్చతోరణముగ నుండెను. పార్వతి జనన వేడుకలు దినమున కొకరీతిలో జరుపుకొనుచుండిరి. యక్ష, కిన్నర, దేవ దానవులతోపాటు బ్రహ్మాదులును హిమవంతుని కీర్తింపసాగిరి. ఆతనికి గల ఆనందము అవర్ణనీయము.

## నారదుడు హిమవంతుని గృహమునకు వచ్చుట

నారదునకీ సమాచారము తెలిసినది. హిమాచలమునకు చేరినాడు. అమ్మహర్షిని పర్వతరాజు ఆదరించి పాదప్రక్షాళన జేసి ఉత్తమ ఆసనముపై కూర్చుండబెట్టినాడు. మేనాసహితుడై నారద మహర్షి పాదములకు నమస్కరించి పాదములుగడిగి ఆ జలమును గృహమున జల్లి తనకు గలిగిన అదృష్టమునకు ఆనందించి తన ముద్దుల కుమార్తెయగు పార్వతిని బిలిచి నారద మహర్షి పాదపద్మములకు సాష్టాంగ దండప్రణామము చేయించాడు.

అప్పుడు హిమవంతుడు నారదమహర్షితో స్వామీ ! మీకు భూత, భవిష్యద్వర్తమానములు గూర్చి బాగుగ దెలియును. గనుక ఈ కన్యక గుణదోషములు చెప్పగోరుచున్నాను. అని పలుక నారదుడా హిమవంతుని మాటలకు ఆనందించి యిట్లు పలుకసాగినాడు.

ఓ హిమవంతుడా ! నీ కుమార్తె సర్వసద్గుణరాశి. సహజము గనే ఈమె సుందరమైనది. సుశీల సంపన్నురాలు. ఈమెకు ఉమా, అంబికా, భవాని, గిరిజా శాంకరి అని అనేక నామములు గలవు. ఈమె భర్తయందనురాగము గలిగి యుండును. సౌభాగ్యవతిగ నుండును. ఈమె మీ యింటిలో పుట్టుట వలన తల్లిదండ్రులగు మీకు కీర్తి గలుగును పార్వతిని పదునాలుగు భువనములలో పూజించెదరు. ముక్తి లభించును. పతివ్రతామ తల్లులెల్లరు పార్వతీదేవిని స్మరించెదరు. ధర్మముల బాటించెదరు ఓ పర్వత రాజా ! నీ కుమార్తె సులక్షణ సంపన్నురాలు. అయినప్పటికి కొన్ని అవలక్షణములు గలవు. చెప్పుచున్నాను వినవలసినది. ఈమెకు తండ్రిలేనివాడు, మానహీనుడు, ఉదాసీన స్వభావము గలవాడు, త్రిగుణాతీతుడు, సంశయహీనుడు, యోగి, జటాధారి, నిష్కామహృదయుడు, దిగంబరుడు, అమంగళవేషధారి; సర్ప ములే ఆభరణములుగా గలవాడు ఈమెకు భర్తయగునని చేతి రేఖలు దెలుపుచున్నవి. అని నారదుడు ఆ దంపతులకు చెప్పినాడు.

అమ్మహర్షి మాటలు నిజమని నమ్మిన కొందరు బాధ చెందు చుండిరి. పార్వతికి ఆనందము గలుగుచున్నది. కాని నారదుడు వారి భావనలు గ్రహింపలేకుండెను. వారి అవస్థలు ఒకే విధముగ నున్నను అంతర్గత భావనలు వేరుగనుండెను. మేనక, హిమవంతుల యొక్క, పార్వతి, ఆమె స్నేహితులకు శరీరములు పులకరించెను.

నేత్రములు ప్రేమాశ్రువులచే నిండెను. నారద మహర్షి మాటలు సత్యములగునని వారెల్లరు భావించిరి. పార్వతికి శివుని చరణ కమలముల యందు ప్రీతి మిక్కుటమైనది. శివుడు భర్తయగుటను కష్టంగా భావించింది. ఆమె తనలో గల ప్రేమ భావము నెవరికి తెలుపక ఒక స్నేహితురాలి యొద్దకుచేరి ఆమె వద్ద కూర్చున్నది. అచ్చటకు చేరిన వారెల్లరు వివిధ విధముల ఆలోచింపసాగిరి.

అప్పుడు నారదముని ఓ హిమవంతుడా ! నా మాటను వినుము. దేవతలుగాని, నాగులుగాని, మానవులుగాని, సిద్ధపురుషులు గూడా బ్రహ్మ వ్రాసిన వ్రాతను చెరుపలేరు. దైవము మీకు అనుకూలించిన మీ కార్యము నెరవేరును. పార్వతీదేవి కోర్కె తీరవలెనన్నను, మీ సందేహము తీరవలెనన్నను నే జెప్పినట్లు వినుము.

నే జెప్పిన అవగుణములన్నియు శివుని యందున్నవని నాకనుమానము గలుగుచున్నది. పార్వతి శివునకు అర్ధాంగియగుట నిశ్చయము. మీ అమ్మాయిని శివునకిచ్చి వివాహము జేసిన ఆయన అవగుణములన్నియు సద్గుణములుగ మారును. సందేహము లేదు. శ్రీమన్నారాయణుడు అనంతశేషునిపై పరుండి నిద్రించి నప్పటికిని పండితులు, భక్తులు దోషముగ భావింపరు గదా ! సూర్యాగ్నులు దుర్గంధములలోని రసముల నాస్వాదించినను వారికి కళంకమును అంటగట్టలేము గదా ! గంగానది మొదలుగా గల పుణ్యనదులలో పవిత్ర అపవిత్ర జలము ప్రవహించుచున్నను వాని నెవరు అపవిత్రముగ భావింపరు. సూర్యాగ్నులవలె శివుడు పరమమిత్రుడు. అతనికి ఏ దోషములు లేవు. అజ్ఞానులకు అహంకారము మెండు గనుక పరమశివుని దూషించెదరు. శివుడు

నరుడని పలుకుదురు. అట్టివారు కొన్ని కల్పముల వరకు నరకమున పడెదరు. జీవాత్మ పరమాత్మతో సమానము గాగలదా !

గంగాజలముతో సారాయిని గాచినను సాధువులు, సజ్జనులు ఆ జలమును పానము చేయరు గదా ! ఆ సారాయియే గంగా నదిలో గలిసిన పరమ పవిత్రమగును. అదే విధముగ జీవుడు పరమాత్మను బొందిన ముక్తుడగును. సర్వ సమర్థుడగు శివుడు పార్వతిని వివాహమాడుటచే సమస్త కల్యాణములు చేకూరును. శివారాధనము కఠినము. తపస్సు జేసిన వెంటనే ప్రత్యక్షమగును. కోరిన కోర్కెలు తీర్చును గనుక నీ కుమార్తె తపమాచరించిన యెడల త్రిపురారి మీ బాధలు పోగొట్టును. ప్రపంచమున ఎందరో పెండ్లికుమారులున్నను నీ కుమార్తె పరమశివునే వివాహమాడును. శివుడు వరప్రదాత. తన భక్తులకు సుఖమును, ఆనందమును గలుగజేయును. శివుని ఆరాధించక ఎన్ని యోగములు, వ్రతములు, తపములు జేసినను వారి వాంఛలు నెరవేరవు. అని నారదుడు చెప్పి భగవన్నామమును కీర్తించి, పార్వతిని ఆశీర్వదించి ఓ 'హిమ వంతుడా ! సందేహింపకుము. నీకు శుభములు గలుగుగాక ! సుఖసంపదలు వర్థిల్లుగాక ! అని ఆశీర్వదించి వెడలినాడు.

ఆ నారదుడు బ్రహ్మలోకము జేరినాడు. మేనాదేవి ఏకాంత మున తన భర్తయగు హిమవంతుని వద్ద కెడలి నాథా ! నారదుని మాటలు నాకు అర్థమగుటలేదు. మన పార్వతికి ఉత్తముడగు వరుడు లభించిననే వివాహము జేయుడు. లేనిచో కన్యగనే యుండును. అయోగ్యున కిచ్చి వివాహము చేయవద్దు. ఆమె నా ప్రాణసమానురాలు. నా మాటలు బాగుగ విచారించి ముందు

వెనుకల బాధలు గలుగకుండునట్లు యోగ్యుడగు వరునితో వివాహము జేయుము. అని పలుకుచు మేనాదేవి భర్త పాదములకు సాష్టాంగదండ ప్రణామము జేసినది. అప్పుడు హిమవంతుడు ఆనందించినవాడై ప్రియా ! మేనా ! చంద్రునిలో అగ్నిజ్వాలలు బయలుదేరునేమో గాని, నారదుని మాటలు అసత్యములు గావు. సర్వభారము భగవానునిపై వేసి శాంతిగ నుండుము పార్వతి నుదుట ఎవరిని భర్తగా బ్రహ్మ వ్రాసినాడో అతడే మన కుమార్తెకు వరుడగును.

నీకు పార్వతియనిన మిక్కుటమగు ప్రేమ గలదు. ఆమె యొద్దకు నీవు వెడలి తపము చేయుమని చెప్పుము. తపము చేసినగాని శివుడు వరుడుగ లభింపడు. నీకు దుఃఖములు, కష్టములు పోవలెనన్న శివుడే పార్వతికి భర్తగావలెను. అప్పుడే నీకు శాంతి, సుఖము, ఆనందము లభించును. నారదుని మాటలు సత్యము. శివుడు సర్వగుణనిలయుడు. సద్గుణరాశి అసంబద్ధపు పలుకులు పలుకకుము. నిష్కళంకుడు, భక్త జన పోషకుడు ప్రభువునై యున్నాడు. అతడే రక్షకుడు.

భర్త మాటలను విన్న మేనాకు ఆనందము గలిగింది. వెంటనే పార్వతి యొద్దకు వెడలినది. ఆమెను జూడగనే కన్నుల వెంట దుఃఖబాష్పములు కారుచుండెను. పార్వతిని తొడపై కూర్చుండబెట్టుకొని మాటి మాటికి మేనా పార్వతిని హృదయమునకు హత్తుకొనసాగెను. కంఠము గద్గదికమైనది. నోటి వెంట మాటలు వచ్చుటలేదు. పార్వతి తెలిసికొని తల్లిని సంతోషపెట్టుటకు మృదువుగ నిట్లు పలుకసాగినది.

## పార్వతి స్వప్న వృత్తాంతము

అమ్మా! నేనొక కలగంటిని. అందొక సుందరుడు గౌర వర్ణముగ బ్రాహ్మణుడు ఆ కలలో గన్పించి పార్వతీ! నారదుని మాటలు సత్యమని నమ్ముము. తపస్సుకు బయలుదేరుము. నీ తల్లిదండ్రులకు సుఖము గలుగును. నీలో గల దోషములు దొలగును. శుభములు గలుగును. పార్వతి! తపోబలముచేతనే బ్రహ్మదేవుడు చరాచరముల సృష్టించినాడు. విష్ణువు పదునాలుగు భువనముల పాలించుచున్నాడు. పరమశివుడు ప్రళయమందు భువనభాండములను లయమొందించుచున్నాడు. అనంతశేషుడు తపః ప్రభావముచేతనే భూభారమును వహించుచున్నాడు. పార్వతీ! ఈ సృష్టి స్థితి లయములు తపః ప్రభావముపై నాధారపడి యున్నవి. తపస్సులో గల శక్తి ఎంతదో తెలిపితిని గనుక నీవున్నా తపమున కేఁగుము. అని పలికినట్లు తెలుప మేనా విని ఆశ్చర్యము జెంది హిమవంతుని సమీపించి పార్వతీదేవికి గలిగిన స్వప్న వృత్తాంతమును గూర్చి సవివరముగ తెలిపినది.

అనేక విధములుగ పార్వతీదేవి తల్లి-దండ్రులకు దెలియ జెప్పినది. అవధులులేని సంతోషముతో తపము చేసికొనుటకు పార్వతి బయలు దేరినది. ఆమె తల్లిదండ్రులు పార్వతి వియోగ బాధను సహింపలేక ఏమియు మాటాడలేకపోయిరి. ఆ శుభ సమయముననే వేద శివుడను ఋషి వచ్చి పార్వతి పూర్వజన్మ వృత్తాంతమును జరుగబోవు వృత్తాంతమును దెలియజెప్పుచుండ వారెల్లరు శాంతించిరి.

## పార్వతి తపస్సు

పరమ శివుని చరణ కమలములను హృదయ మందు ధరించి పార్వతి తపస్సుచేయుట ప్రారంభించినది. ఆమె శరీరము

మిగుల సుకుమారమైనను భోగభాగ్యములను త్యజించి వేయి సంవత్సరములు కందమూలఫలములు దింటూను, నూఱు సంవత్సరములు ఆకులలములు తింటూ, కొన్నాళ్ళు జలమునే తీసుకొనుచూ, కొన్నాళ్ళు వాయువునే భక్షించుచు, కఠినములగు ఉపవాసములుంటూ, మూడు వేల సంవత్సరములు పండి ఎండి రాలిన ఆకులు తింటూ కొన్నాళ్ళు ఆ ఆహారమును గూడా మాని, శివుని యందు మనస్సుంచి తపము చేసికొనుచుండ ఆమెకు నూతనోత్సాహము గలుగుచుండెను. శరీర తాపము తొలగినది. క్రొంగొత్త భావములు గలుగుచుండెను. ఆహారముగ ఆకులు, అలములు గూడ మానుటచే "అపర్ణ" అని పేరు వచ్చెను. ఆమె చేయు తపమునకు ఆకాశవాణి మెచ్చుకొని ఓ పార్వతీ! నీ కోర్కె నెరవేరును. నా మాట నమ్ముము. నీ ఉగ్రమగు తపస్సును విరమించుకొనుము. నీకు భర్తగ పరమశివుడు లభించును. ధీరులు మునులు, జ్ఞానులు, యోగులు గూడా నీవలె తపస్సు చేయలేదు. నా మాట సత్యమని తెలిసికొమ్ము. నీ తండ్రి నిన్ను తీసుకొని వెడలుటకు వచ్చును. హఠము నొదలి నీ తండ్రితో యింటికి పొమ్ము. సప్తర్షులు నిన్ను కలిసికొందురు. నా మాటలు సత్యమని చెప్పెదురు. అని ఆకాశవాణి పలుక పార్వతికి ఆనందము గలిగినది. శరీరము గగుర్పాటు చెందింది. ఓ భరద్వాజా! నేను నీకు సుందరమైన పార్వతీదేవి చరిత్రమును చెప్పితిని. పరమశివుని గూర్చి చెప్పెదను. జాగ్రత్తగ వినుము. అని యాజ్ఞవల్క్య మహర్షి పలికినాడు.

సతీదేవి శరీర త్యాగము చేసినది మొదలు శివుడు విరాగిగా నుండి ఎల్లప్పుడు శ్రీరామ నామమును జపించుచు అక్కడక్కడ

శ్రీరామ కథలు జరుగుచుండ వెడలి వినుచుండెను. సమస్త చరాచర జీవులకు ఆనందమును గలుగజేయు శ్రీరామచంద్రుని హృదయమందు ధరించి, ధ్యాననిమగ్నుడై జ్ఞానులకు, మునులకు తత్త్వబోధ చేయుచుండును. శ్రీరామచరితమును వర్ణించుచుండెను. కామరహితుడు, పరబ్రహ్మ స్వరూపుడైనను తన్నాశ్రయించిన సతీదేవి వియోగ దుఃఖము వలన దుఃఖితుడైనట్లు జూచువారల కుండెను. ఇట్లు చాలా కాలము గడచెను. శ్రీరాముని యందు భక్తి అభివృద్ధి యగుచుండెను. యమ, నియమ, కఠోరమగు దీక్షలో నున్న పరమశివుని దయాసముద్రుడు, పరోపకారి, రూపవంతుడు, ఆదర్శ శీలముగలవాడు, తేజోవంతుడు, భగవంతుడునగు శ్రీరామ చంద్రుడు జూచి దర్శనమిచ్చి, అతనికి గల శ్రద్ధాభక్తులకు సంత సించి, స్తుతించి, నీవుదప్ప అన్యులెవరున్నా యిట్టి కఠిన వ్రతము లతో దపము చేయలేరని పలికినాడు. నాపైన నీకు ప్రేమగలదేని పరమశివా ! నా మాట దయతో వినుము. పార్వతీదేవిని వివాహము జేసికొమ్ము. నా కోర్కెను సఫలముచేయుము అని పలికినాడు.

శివుడానందించి శ్రీరామా ! నీవు చెప్పినట్లే చేతును. ఉచితా నుచితములతో నాకు బనిలేదు. స్వామి ఆజ్ఞను తిరస్కరించను తల్లి, దండ్రి, దైవము, గురువు పలికిన పలుకులు తిరస్కరించ రాదు. ఆ పలుకులు మిక్కలి శుభములను గలుగజేయును. నీ యాజ్ఞను తప్పక పాటింతును. అని శివుడు పలుక శ్రీరాముడు ఆనందించి నీ ప్రతిజ్ఞ చాలా గొప్పది. కొన్ని సద్విషయములు చెప్పెదను. హృదయ మందుంచుకొమ్మని పలికి అంతర్ధానమై నాడు. శ్రీరాముడు చెప్పినట్లే శివుడు ఆ విషయములన్నింటిని హృదయమునందుంచుకొని ధ్యాననిమగ్నుడైనాడు. సప్తర్షులు శివుని

వద్దకు వచ్చిరి. మహాదేవుడు వారిని సత్కరించి ప్రేమయుక్తము లగు మాటలనిట్లు పలికినాడు.

సప్తర్షులారా ! మీరు పార్వతి యొద్దకు వెడలుడు. ఆమెకు నాపై గల ప్రేమను పరీక్షచేయుడు. ఆమెను యింటికి దీసికొని వచ్చు ఉపాయము నాలోచింపుడు. హిమవంతుని సందేహములు పోగొట్టుడు అని పలికినాడు.

సప్తర్షులు మహాదేవుని ఆజ్ఞానుసారము తపస్సు చేయుచున్న పార్వతి వద్దకు వచ్చి ఆమెను జూడ తపస్సే స్త్రీ రూపము దాల్చి కూర్చుండినట్లుండెను. ఆమె వద్దకు చేరి యిట్లు పలుకుచుండిరి అమ్మా ! పార్వతి నీవేల యిట్టి కఠోరమగు తపము నాచరించు చుంటివి ? నీ ఆరాధ్య దైవమెవరు ? నీవేమి కోరికతో ఈ కఠిన మగు తపస్సు చేయుచుంటివో తెలుపుము అని సప్తర్షులు పలుక వారికి పార్వతి యిట్లు చెప్పదొడంగినది. స్వామీ ! నాకు గల కోరికను మీరు విన్న యెడల నన్ను పరిహసించెదరు. నా మూర్ఖత్వ మును జూచి నవ్వెదరు. నా కోర్కె నీటిపై గట్టిన గోడ కట్టలువలె నున్నది. నారదుడు చెప్పిన మాటలు సత్యములని నమ్మి రెక్కలు లేని పక్షి ఎగురుటకు ప్రయత్నము చేయుచున్నటుల నేనా ప్రయత్నము చేయుచున్నాను. మహాత్ములారా ! నేను సదాశివుని భర్తగా కోరి తపము చేయుచున్నాను. అని పలుక ఆ ఋషులు నవ్వుకొని పార్వతీ ! నీవు పర్వతరాజుకు జన్మించితివని పలికితివి నారద మహర్షి మాటలు విని నాటి నుండి నేటి వరకు ఎవరు గృహములలో సుఖముగ నుండిరి. అతడు వెడలి దక్ష పుత్రులకు ఉపదేశమిచ్చెను. వారు తపము చేసికొనుచు యింటివైపుకు రాలేదు. చిత్రకేతు మహారాజు గృహమును శూన్యము జేసెను.

హిరణ్యకశిపుని నాశనము జేసెను గదా ! నారద మహర్షి మాటలు విన్నవారు బికారులై గృహముల నొదలి అడవులపాలయ్యేదరు. అతని మనస్సు కపటముతో నిండినది. అతడు చూచుటకు సజ్జనునివలె నుండును. అతడు సర్వులను తనవంటి వారుగ తయారు చేయుటయే అతని పని. నీవు అట్టి నారదుని మాటలు విని శివుని ఏల పతిగా కోరుకొనుచుంటివి ? అతడు ఉదాశీనుడు, గుణహీనుడు నిర్లజ్జుడు, అమంగళ వేషధారి. నర కపాలముల మాలగా ధరించును. కులహీనుడు. నివశించుటకు యిల్లు, వాకిలి లేదు. దిగంబరుడు. అతడు సర్పములనే ఆభరణముల ధరించును. అట్టి వానిని నీవు భర్తగా పొంది నీవేమి సుఖింపగలవు ? ఆ నారద మహర్షి మాటలు పూర్తిగా మరచిపొమ్ము. ఆ శివుడే పూర్వము సతీదేవిని వివాహమాడి ఆమెను వదలిపెట్టినాడు గదా ! ఏ చింతయు లేనివాడు యాచించిన పదార్థములుదిని సుఖముగ నిదురించును. అట్టివానితో నీవేల కాపురము చేయుదువు ? ఏమి సుఖపడుదువో ఆలోచించుకొమ్ము.

ఓ పార్వతీ మా మాటను వినుము. నీకు తగిన వరుని విచారించితిమి. అతడు సుందరుడు, పవిత్రుడు, సుఖదాయకుడు, సుశీలుడు, భక్తజనపోషకుడు. అతనిని వేదములు గూడా కీర్తించుచుండును. దోషరహితుడు, సద్గుణనిలయుడు, లక్ష్మీకి భర్త. వైకుంఠము నందు నివశించును. అట్టి వారిని నీకు వరునిగా జేయగలమని పలుకగా వారి మాటలకు నవ్వి పార్వతి యిట్లు పలుకసాగెను.

మీరు చెప్పిన మాటలు సత్యములేయైనను నాకు ఈ శరీరము పర్వతరాజు వలన గలిగినది. హఠమును వదలను. నా ఈ శరీరము

పోయినను పోవుగాక! బంగారము రాతినుండియే వచ్చును. దానిని కాల్చి సమ్మెట దెబ్బలు వేసినగాని అది ప్రకాశింపదు గదా! గృహమందు నివసించినను, నివసింపకున్నను నాకు భయములేదు. గురువు మాట యందు విశ్వాసము లేనివారికి సుఖ సంపదలుగాని, సిద్ధులుగాని గలుగవు. మంచి మార్గమట్టి వారికి లభింపదు.

మహాదేవుడు అమంగళములకు పుట్టిల్లేగావచ్చును శ్రీమన్నారాయణుడు సద్గుణములకు నిలయుడు గావచ్చుగాక. ఎవని మనస్సు ఎవని యందు రమించునో వానితోనే ఆ కార్యములు నెరవేర్చుకోవలెను.

మహర్షులారా! మీరు మొదటనే ఆ మాట చెప్పియుండిన శిరసావహించి ఆచరించి యుండెడిదానను. నేను పరమశివుని గుణదోషములు లెక్కింపక అతనినే వివాహమాడుటకు నిర్ణయించు కుంటిని. వరునకు దగిన కన్యకలు కావలెనని ఈ ప్రపంచములో అనేక మంది లభింపగలరు. మీరు ఆలస్యము చేయక తగినట్లుగ ఆలోచింప గోరుచున్నాను. కోటి జన్మలనెత్తియైనను పరమశివునే వివాహమాడెదను. అట్లుగాదేని కుమారిగ ఉండెదను. శివుడే వచ్చి అనేక పర్యాయములు చెప్పినను నారదుని ఉపదేశము నేమాత్రము వదలను. అని పలుకుచు పార్వతి ఆ సప్తర్షుల పాదములపైబడి చాలా ఆలస్యమైనది. మీరు మీ గృహములకు వెడలుడు. అని పలుక ఆమెకు శివుని యందు గల ప్రేమను జూచి నీకు జయమగుగాక! జయమగుగాక! నీవు శివునే భర్తగ పొందెదవుగాక! అని ఆశీర్వదించి అమ్మా! నీవు మాకు మాతృ స్వరూపిణివి. శివుడు జగత్తుకు తండ్రి. ప్రభువులై యున్నాడు.

మీరుభయులు పదునాలుగు భువనములకు మాతాపితరులని పలికి పార్వతీదేవి చరణములకు నమస్కరించి వారచ్చట నుండి బయలు దేరిరి. వారి శరీరములు అనేక పర్యాయములు పులకరించినవి.

సప్తర్షులు హిమవంతుని దర్శించి సమస్త విషయములు తేటతెల్లముగ చెప్పి ఆమెను ఇంటికి తీసుకొని రమ్మని పలికిరి. అచ్చటను ఆ ఋషులు శివుని వద్దకు వచ్చి జరిగిన సంభాషణా విషయములు పూసగ్రుచ్చినట్లు తెలియజెప్పిరి. పార్వతికి తనపై ప్రేమ గలదని విని శివుడానందభరితుడైనాడు. సప్తర్షులు వారి వారి గృహముల కెడలిరి. ప్రసన్నవదనుడై శివుడు శ్రీరాముని ధ్యానింపసాగినాడు.

ఆ కాలమున తారకుడను రాక్షసుడు గలడు. తపస్సున బలమున చాలా గొప్పవాడు. అతడు అష్టదిక్పతులను జయించి, వారి వారి సిరిసంపదలను హరించి బాధింపసాగెను. అతడు అజేయుడు. అతని జేతిలో దేవతలు అనేక పర్యాయములు ఓడిరి. ఒక్క పర్యాయమైనను జయింపలేకపోయిరి. వారెల్లరు గలసి బ్రహ్మవద్దకు వెడలిరి. తమ బాధలు దుఃఖములు చెప్పుకొనిరి. బ్రహ్మ వారి నోదార్చి శివుని వీర్యము నుండి పుట్టినవాడు మాత్రమే తారకాసుడిని సంహరింపగలడని పలికినాడు, ఈశ్వర సహాయము లభించిన యెడల మన కార్యము నెరవేరును ఏదైనా ఉపాయ మాలోచింపుము. దక్ష యజ్ఞము నందు సతీదేవి శరీరము నొదలి హిమవంతుని యింట పార్వతిగ జన్మించినది. ఆమె శివునే భర్తగా గోరి కఠోర నియమములతో తపస్సు చేయుచున్నది. శివుడును సర్వస్వము నొదలి తపమాచరించుచున్నాడు. ఏదో విధముగ శివుని ప్రసన్నునిగ జేసికొనుడని బ్రహ్మ దేవతలతో పలికినాడు.

# శివుడు మన్మధుని భస్మము చేయుట

దేవతలారా! శివుని వద్దకు మన్మధుని పంపిన అతడు వెడలి వాని సమాధి స్థితిని భంగపరచును. శివుడప్పుడు బాహ్య స్మృతికి వచ్చును. మీరు వెడలి వారి పాదములపైబడి మమ్ముల కాపాడుమని ప్రార్థింపుడు. ఆయన ప్రసన్నుడగును. మనము అప్పుడు మంచి మాటలతో యొప్పించి వివాహము చేయుదము. మనమట్లు జేసిన దేవతల కార్యము నెరవేరును. అని బ్రహ్మ పలికినాడు. వారెల్లరు ఆనందించి బాగున్నదని పలికి మన్మధుని కీర్తించిరి. అతడు రథారూఢుడై వారి యెదుట నిల్చిండినాడు. అప్పుడు వారెల్లరు తమ బాధలు చెప్పుకొనిరి. వారి మాటలు విని, నవ్వుకొని శివునితో విరోధము నాకు క్షేమముగాదని పలికినాడు. అయినను మీకార్యము నెరవేర్చెదను. పరోపకారము కంటే ఉత్తమ ధర్మము లేదని వేదములు ఘోషించుచున్నవి. సాటివాని కొనికొరకు తమ సర్వస్వమును త్యాగముజేసి ప్రాణముల నొదలువారు సత్పురుషులని పురాణేతిహాసములు, మహాత్ములు పలుకుచున్నారు. అని పలికి బ్రహ్మాది దేవతలకు నమస్కరించి పుష్పబాణములు ధరించి వసంతుని సహాయముతో శివుని వద్దకు మన్మధుడు వెడలినాడు. దశదిశల తన ప్రభావమును ప్రకటింపజేసి ప్రకృతినే తన స్వాధీనము నందుంచుకొనెను. క్షణకాలములో అతని ప్రభావము అంతట వ్యాపించెను.

బ్రహ్మచర్యము, యమ, నియమములు, ధైర్యము, ధర్మము, జ్ఞానము, విజ్ఞానము, సదాచారము, జప, యోగములు, వైరాగ్యము మొదలగునవి భయపడి దాగినవి. వివేకము పారిపోయెను. సద్గ్రంథములు పర్వత గుహలలో దాగినవి. సర్వజగములు ఆందోళన చెందసాగెను. మనమిప్పుడేమి చేయవలెనోయని విధాతను

ప్రార్థింపసాగిరి. రక్షించువాడెవడాయని ఆందోళనపడుచుండిరి. ఈ చరాచర జగత్తులోని జీవులెల్లరును తమతమ మర్యాదలు పాటించుటలేదు. పశుపక్ష్యాదులును, విచక్షణాజ్ఞానము గలిగిన మానవులును మర్యాదలు దప్పిరి. మన్మధునికి వశులైరి.

సర్వుల హృదయములలో స్త్రీ వాంఛలు బయలుదేరెను. లతలు వృక్షజాతులను ముద్దుపెట్టుకొనుచుండెను. నదులెల్లను పొంగి సముద్రములో కలియుచుండెను. చెరువులు, కుంటలు పొంగిపొరలుచు నదులలో కలియుటకు ప్రయత్నించుచుండెను. జడములగు వృక్షజాతుల, నదుల, చెరువుల, కుంటల దశలు యిట్లుండ చేతనము గల జీవుల విషయముల నెవరు చెప్పగలరు ? భూమ్యాకాశమున గల చరాచర జీవులు సంయోగ వియోగములలో దేలియాడసాగెను.

సర్వలోకములలోని వారు మన్మధతాపమునకు వశీభూతులైరి. చక్రవాక పక్షులకు రాత్రింబవళ్లు తెలియకుండెను. దేవ, దానవ, యక్ష, రాక్షస, కిన్నర, నాగులు, భూత, ప్రేతాళ, పిశాచాదులు గూడా కామక్రీడలలో దేలియాడుచుండిరి. సిద్ధులు, విరక్తులు, మహామునులు, యోగీశ్వరులు మన్మధతాపమునకు వశులైరి. వారు యోగములుమాని స్త్రీ విరహబాధను చెందుచుండిరి.

అట్టి వారే మన్మధ బాధలో మునుగుచుండ సాధారణ మానవుల విషయములు యేమని చెప్పగలము ? ప్రకృతిని బ్రహ్మమయముగ జూచు విరక్తులు, మహాత్ములు గూడా ఈ ప్రపంచమును స్త్రీమయముగ జూచుచుండిరి. స్త్రీలు ఈ ప్రపంచమును పురుషమయముగ జూడసాగిరి. రెండు ఘడియల కాలము

ఈ ప్రపంచము నంతటిని మన్మథుడు కామతాపమునకు గురిచేసి నాడు. సర్వజీవులును ధైర్యమును గోల్పోయిరి. మన్మథుడు వారి హృదయమును హరించినాడు. కాని శ్రీరామ భక్తులు మాత్రము మన్మథతాపము నుండి బయటపడిరి. శ్రీరామచంద్రుడు వారిని కాపాడుచుండుటచేత మన్మథుడు వారి నేమియు చేయజాలక పోయెను.

పంచబాణుడు రెండు ఘడియల కాలము విజృంభించి శివుని వద్దకు వెడలినాడు. అతడు ధ్యానమందుండుటను జూచి నాడు. శంకరుని పరాజితుని జేయుట కష్టమని భావించాడు. భయము గలుగుచున్నది. ముందు వెనుకల ఆలోచింపక కార్య క్రమమున కుపక్రమించిన పరాభవము గలుగును. నాకు మరణము గలిగి తీరునని నిశ్చయించుకున్నవాడై ఉపాయమును బన్ని ఋతుశ్రేష్టుడగు వసంతుని పురికొల్పినాడు. అతడు క్రొంగొత్త పుష్పలతాదులతో, లేచిగుళ్లతో వృక్షముల నెల్లను శోభాయమాన ముగ నుండునట్లు జేసినాడు. ఆ వనశోభను ఏ కవియు వర్ణింపలేడు.

వనోపవనములు, బావులు, చెరువులు దశదశలు శోభతో ప్రకాశించుచుండెను. వాటిని జూచువారలకు ఆనందము గలుగు చుండెను. కామికులకు కామవాంఛలు గలుగుచుండెను. ప్రకృతి యొక్క రమణీయతను జూచుటచే విరాగపర్ణమగు నా మనస్సు నందు కామ వాసనలు బయలుదేరెను. ఆ వన శోభను జూచిన వారెల్లరు కామతాపమునకు వశులైరి. మన్మథుడనెడు అగ్నికి మిత్రుడు శీతలుడునగు వాయువు వీయసాగెను. సరోవరములలో రంగు రంగు పుష్పములు వికసించినవి. వానిలో గల మకరంద

మును ఎల్లపుడు తుమ్మెదలు గ్రోలుచుండెను. అప్పుడప్పుడు ఝుంకార నాదములు చేయుచుండెను. రాజహంసలు, చిలుకలు, కోకిలలు మధురముగ గానము చేయుచుండెను. అప్సరసలు నాట్యమాడుచుండిరి.

పంచబాణుడు సేనాసమేతుడై శివుని సమాధిని చెరుచుటకు వివిధ ఉపాయములు ఆలోచింపసాగెను. శివుని సమాధి అచలముగనే యున్నది. మన్మధుని ప్రయత్నము నెరవేరునట్లు లేదు. కోపము ఎక్కువైనది. మామిడి చెట్టునెక్కి పంచపుష్ప బాణముల పట్టుకొని కోపము ఆకర్ణాంతము అల్లె త్రాడును లాగి సమాధిస్థితి యందున్న శివుని హృదయమునకు గురిచూచి తగులునట్లు విడచెను. ఆ బాణములు శివుని హృదయమునకు దగులుటచే వెంటనే లేచినాడు. ఆతనికి సమాధి స్థితి చెడినది. కన్నులు దెరచి నలువైపుల జూడసాగాడు. లేచిగుబ్బల మధ్య దాగియున్న మన్మధుని శివుడు మిక్కిలి కోపముతో జూచుచుండ త్రిలోకములు భయపడుచుండెను. అట్టి సమయమున మూడవ కన్నును దెరచి జూచి మన్మధుని బూడిదపాలుజేసినాడు. ఆతని మరణమునకు భూనభోంతరాళముల యందు హాహాకారములు బయలుదేరెను. దేవతలు భయపడిరి. రాక్షసులకు మిక్కిలి ఆనందముగనున్నది భోగపరాయణులు కామ సుఖములను మరచి సత్కార్యములు జేయుచుండిరి. భక్తులు, యోగులు, సాధకులు నిష్కంటకముగ నుండిరి. జపము, యోగములలో దేలియాడుచుండిరి. యోగులు సుఖముగ, శాంతిగనుండిరి. రతీదేవి తన భర్త మరణవార్తను విని రోదించుచు శివుని వద్దకు వెడలినది. తన కష్టసుఖముల బాధల గూర్చి ముకుంటికి జెప్పుకున్నది. శీఘ్రప్రసన్నుడు, కృపాసముద్రుడు

సగు శివుడు ఆమె బాధను తెలిసికొని ఓ సతీ ! నీభర్త అనంగుడు అను పేరుతో వర్థిల్లును. ప్రతి జీవునిలోను కామగుణ రూపమున ఉండును. మీరుభయులు ఎట్లు కలిసికుందురో చెప్పుచున్నాను జాగ్రత్తగ వినుము.

భూభారమును హరించుటకు యదువంశమున భగవానుడు శ్రీకృష్ణునిగ అవతరించును. నీపతి వానికి పుత్రుడై జన్మించును. అతడు ప్రద్యుమ్నుడను పేరుతో విరాజిల్లును. నా మాటలు సత్యమని నమ్ముము. అని శివుడు పలుక అచ్చట నుండి ఆమె వెడలినది.

ఓ భరద్వాజా ! బ్రహ్మ మొదలుగా గల దేవతలు కాముని దహన వార్తను విని వైకుంఠమున కెడలిరి. అచ్చట నుండి బ్రహ్మాది దేవతలు, విష్ణుమూర్తి కైలాసమునకు జేరిరి. శివుని ప్రార్థించిరి. వారి ప్రార్థనలకు శివుడు ఆనందించి, దేవతలారా ! మీరెందుకు నా వద్దకు వచ్చితిరి, నా వలన మీకేమి సహాయము గావలెనో తెల్పుడని శంకరుడు పలికినాడు. అప్పుడు వారెల్లరు యిట్లు పలుకసాగిరి. దయాసాగరా ! పరమశివా ! యక్షులు, నాగులు, కిన్నరులు, దేవతలు మీ వివాహము జూడవలెనని కోరుకొనుచున్నారు. మన్మధుని దహింపజేసినను రతీదేవి మొరనాలించి యామె నెట్లు కాపాడితివో అదే విధముగ మమ్ములను కాపాడుము. మహాత్ములు, సత్పురుషులు, శ్రేష్ఠులు మొదట దండించినను చివరకు దయ జూపుట వారి స్వభావము. పార్వతి నిన్ను భర్తగా పొందవలెనని కఠోరమగు తపస్సు చేసినది. దయతో ఆమెను పెండ్లియాడుటకు అంగీకరింపుడు. బ్రహ్మ పలికిన వినయ యుక్తములగు పలుకులకు ఆనందించి శ్రీరామచంద్రుని స్మరించు

కొని శివుడు ప్రసన్నుడై వారి కోర్కెలను మన్నించాడు. దేవతలు ఆనందించినవారై నగారాలు మ్రోగించిరి. శివునిపై పుష్పవృష్టిని గురిపించిరి. జయజయ ధ్వానములు పలికిరి. ఆ శుభ సమయ మునవే సప్తర్షులచ్చటకు వచ్చిరి. బ్రహ్మ వారిని హిమవంతుని దగ్గరకు పంపాడు. పార్వతిని కలియుటకుగాను వారెల్లరు ఆమె తపముజేయు ప్రదేశమునకు వెడలి మధురము, ఆనందముతో గూడిన పలుకులు పార్వతితో నిట్లు పలికిరి.

పార్వతీ! నారదుని ఉపదేశమును విని నీవు మా మాటలను వినక శివునే పెండ్లియాడెదనని పలికితివి. శివుడు కోపించి మన్మధుని భస్మము జేసినాడు. అని సప్తర్షులు పలికిరి. పార్వతి వారి మాటలు విని నవ్వుకొనుచు ఋషులారా! మీరు తగిన విధముగనే పలికితిరి. శివుడు కాముని భస్మము చేసినట్లు మీ రిప్పుడు తెలిసికొనిరి. శివుడు కాముకుడుగానుండెనా? ఏమి? ఆతడు యోగి. అజన్ముడు, అనిత్యుడు, కామరహితుడు, భోగ రహితుడు అని నేను తెలిసికొని మనోవాక్కాయ కర్మల ద్వారా సర్వకాలములలో వారికి సేవ జేయుచుంటిని.

మహాత్ములారా! శివుని భర్తగ పొందుటయే నా దృఢమగు నిశ్చయము. నా ప్రతిజ్ఞను తప్పక నెరవేర్చును. శివుడు కాముని దహించినాడని పలికితిరి. అందువలన మీ అవివేకము తెలియ జేయుచున్నది. అగ్ని స్వభావము దహించుటయే గదా! నామ అగ్నిని సమీపించిన దానికి నామ రూపములు లేకుండా పోవును గదా! మన్మధుడు అటే విధముగ శివుని సమీపించి భస్మమగుట న్యాయమే గదా!

అని ఆ పార్వతి పలికిన పలుకులకు ఆనందించి, సప్తర్షు లామెకు నమస్కరించి, హిమవంతుని వద్దకు వచ్చిరి. సర్వ విషయములు ఆతనికి విన్నవించిరి. మన్మధుని శివుడు భస్మము జేసినట్లు వినుటచే హిమవంతునకు బాధగలిగినది. అదే సమయ మున రతీదేవిని అనుగ్రహించి వరమిచ్చి శివుడు కాపాడినట్లు తెలియుటచేత సంతోషించాడు. శివుని ప్రతాప మెట్టిదో హిమవంతు డెరిగినాడు

మునిశ్రేష్టులను సాదరముగ నాహ్వానించి గౌరవించి, వారి వలన ముహూర్తమును నిర్ణయించి, వేదవిధి ననుసరించి వివాహ లగ్నపత్రికను వ్రాయించి, సప్తర్షులకిచ్చి హిమవంతుడు వారి పద్మములకు నమస్కరించాడు. వారు వెడలి ఆ లగ్నపత్రికను బ్రహ్మకిచ్చిరి. ఆ శుభ పత్రికను జదువునపుడు బ్రహ్మకు గలిగిన ఆనందమును గూర్చి వర్ణింపలేము.

## పార్వతీదేవి కల్యాణ సన్నాహము

బ్రహ్మ ఆ శుభముహూర్తమును ఆ సభలోని వారలకు చదివి వినిపించాడు. అచ్చటకు జేరిన దేవతా గణములు, మునులు, భక్తులు ఆనందించారు. ఆకాశమార్గమున పుష్పవర్షము గురిపించిరి. బాజాభజంత్రీలు వివిధ విధములగు వాద్యములు ప్రమోగించిరి. దశదిశల జయజయ ధ్వానులు ప్రమోగినవి. శుభశకునములు గన్పట్టి సాగెను. దేవతలు తమతమ వాహనములపై ప్రయాణము జేయు చుండిరి. అప్సరసలు నాట్యమాడుచు పాటలు పాడుచుండిరి.

శివుని జటాజూటముపై గంగామాతను అలంకరించిరి. ఫాల భాగమున చంద్రుని ధరించి మూడు నేత్రములు గలిగియుండెను.

యజ్ఞోపవీతముగా, కంఠాభరణములుగ సర్పములు, గళము నందు హాలాహలము హృదయమున నర కపాలమాలను ధరించియుండెను. కల్యాణగుణములకు నిలయుడు, దయాసముద్రుడునగు శివుడు జూచువారలకు అమంగళ వేషధారిగ గన్పట్టుచుండెను.

ఒక చేతి యందు త్రిశూలము, వేరొక చేతియందు డమరుకము శోభించుచుండెను. బాజాభజంత్రీలు వాద్యములు ప్రయోగించుచుండ శివుడు తన వాహనమగు ఎద్దునెక్కి బయలుదేరెను. దేవతా గణములు ఆ శివుని జూచి నవ్వుకొనసాగిరి. బ్రహ్మ, విష్ణుమూర్తి, ఇంద్రుడు మొదలుగా గల దేవతలు సపరివారముగ తమ తమ వాహనముల నెక్కి విడిది గృహముల కెడలుచుండిరి.

ఆ దేవతా సమూహముల, సమాజముల గూర్చి వర్ణింపలేము. పెండ్లి కుమారునకు తగిన పెండ్లికుమార్తె సృష్టియందుండదని భావించుకొనుచుండిరి. అప్పుడు విష్ణుమూర్తి లోకపాలురతో నవ్వుచు మీ మీ సమాజములతో వేరు వేరుగ ప్రయాణము చేయుడని పలికినాడు. పెండ్లికుమారునకు తగినట్లుగ వివాహము జేయుడు. నవ్వులపాలుగారాదని పలికినాడు. విష్ణుమూర్తి మాటలు విని వారెల్లరు విడివిడిగా తమ తమ సేనాసమూహములను నడుపుచుండిరి. విష్ణుమూర్తి మాటలు మహాదేవుడు విని లోలోన నవ్వుకొని భృంగి ద్వారా తన గణములను బిలిపించెను. వారెల్లరు వచ్చిరి. నమస్కరించి తమతమ వాహనముల నెక్కి వెడలుచుండ శివ గణముల జూచి అందరు నవ్వుకొనసాగిరి.

వారిలో కొందరు ముఖములు లేనివారు. వివిధ విధములగు ముఖములు గలవారు కొందరు. అనేక ముఖములు గలవారు

కొందరు కాలుచేతులు లేనివారు, అనేక పాదములు గలవారు, అనేక చేతులు, అనేక కాళ్లు గలవారు, లెక్కకు మిక్కుటములగు కన్నులు గలవారు, నేత్రములు లేనివారు, కృశాంగులు కొందరు, దృఢకాయులు కొందరు, పవిత్ర వేషధారులు కొంవరు, అపవిత్ర వేషధారులు కొందరు, భయంకరాకారులుగ నుండి తమ తమ చేతులలో నర కపాలముల ధరించి యుండిరి. ఆ వికార రూపములు గల రాక్షసాకారులు సారాయమును సేవించుచుండిరి. వారిలో కొందరు గాడిదలు, పందులు, కుక్కలు, గ్రద్దలు వంటి ముఖములు గలిగియుండిరి. ఆ సమాజముల లెక్కింపజాలము. భూత, ప్రేత, పిశాచ, యోగినీ గణములు గలవు. ఆ నానా జాతుల లెక్కింపజాలము. ఆ రూపములు వర్ణింపలేము. వారు నాట్యమాడుచు, గానము చేయుచు ఆనందముగ నుండిరి. వారికి గల సంతోషమును గూర్చి ఏ కవియు వర్ణింపలేడు. వారు వివిధ విధములగు వ్యక్తులను గలియుచు, మాటాడుకొనుచు, నవ్వుకొనుచు, ఆనందించుచు నాట్యమును జేయుచుండిరి. వారి ఆనందమునకు అవధులు లేవు.

హిమవంతుడు పెండ్లికుమారునకు అతిథులకు తగినట్లు విడిది గృహము లేర్పాటు గావించినారు. వారెల్లరు ఆనందించుటకు వివిధ విధములగు వినోద కార్యక్రమములు నేర్పాటుగావించినాడు. వర్ణించుటకు వీలులేని విధములుగ కళ్యాణ మంటప చిత్రరచనా నిర్మాణము గావించాడు. చిన్న పెద్ద అను విచక్షణ లేకుండా పర్వతముల, కొండల, నదుల, చెరువుల, సముద్రముల నాహ్వానించుటకు దూతలను పంపెనాడు. వారు కామరూపులగుటచే వివిధ రూపముల ధరించి తమ తమ సమాజముల వెంటనిడుకొని

పిలుపు ననుసరించి హిమవంతుని గృహమునకు వచ్చిరి. వారెల్ల రకు సకల మర్యాదలుఁజేసి వారివారి యోగ్యతను అనుసరించి విడుదులు ఏర్పాట్లుజేసినాడు. ఆ పురశోభను వర్ణింపలేము. అది బ్రహ్మరచనా నైపుణ్యమును మించియుండెను. వనములు, తోటలు చెరువులు, బావులు, నదులు, సముద్రముల, పర్వతనముల అందము నెవరు వర్ణింపగలరు ? ఆ పురములోని ప్రతి గృహము మంగళ తోరణములచే అలంకరించబడ్డది. ఆ పట్టణ ప్రజలు రతీ-మన్మధు లను మించిన అందము గలిగియుండిరి. ఆ పుర స్త్రీలను జూచి మునులెల్లరు మోహమును చెందుచుండిరి.

అట్టి దివ్య శోభను సంతరించుకొన్న పట్టణములో హిమ వంతుని ఇంట జగదంబ పార్వతిగ పుట్టెను అట్టి పురశోభను ఏమని వర్ణింపగలము ? జగదంబను గూర్చి ఎవరు ఏమని వర్ణింప గలరు ? అష్టసిద్ధులు, సర్వసంపదలు, సకల శుభములు, సుఖ మును, వినోదమును గల్గించుచు అచటనే నివశించుచుండెను. పెండ్లికుమారుడు ఊరేగుచూ నగర సమీపమునకు వచ్చినాడు. ఆ నగరశోభను ఊరేగింపును జూచి తత్తరపడుచుండిరి. అచ పెండ్లివారు శృంగార వేషములుధరించి ఆనందముతో తమ తమ వాహనములనెక్కి ఎదుర్కోలు సన్నాహముతో మగ పెండ్లివారిని ఆహ్వానించుటకు బయలుదేరి వచ్చుచుండగ దేవతా సమూహ ములుజూచి ఆనందించిరి.

ప్రజలు శివుని అనుయాయుల జూచుటచే భయపడి పరుగిడసాగిరి. ధైర్యవంతులు, పెద్దలు మాత్రమే అచ్చట నిలువ గలిగిరి. పిల్లలు, స్త్రీలు భయకంపితులై ప్రాణముల నరచేతబెట్టుకొని యిండ్లకు పారిపోయిరి. వారి వారి తల్లిదండ్రులు మీరేల

భయపడుచున్నారని అడుగసాగిరి. అప్పుడు వారెల్లరు మేమేమి చెప్పగలము ? మా నోళ్ల నుండి మాటలు వచ్చుట లేదు. వారు పెండ్లివారో లేక యముడు తన సేనతో గలిసి ఊరేగుచున్నాడా ? అన్నట్లున్నది. పెండ్లి కుమారుడు ముసలి ఎద్దుపై వచ్చుచున్నాడు. అతడు శరీరము నిండుగ విభూతిని ధరించాడు. పుర్రెల మాలను, కంఠాభరణములుగ పాములను, పెద్ద పెద్ద జడలను ధరించి జూచువారలకు భయంకరాకారముతో గన్పట్టుచున్నాడు. అతని చుట్టును భయమునుగొల్పు రాక్షసులు, పిశాచగణములు, భూత, ప్రేతముల సమూహము లున్నవి. ఆ వికారరూపులగు శివగణము లను జూచి బ్రతికి బయటపడిన వారు పుణ్యాత్ములు. అట్టివారే పార్వతీ పరమేశ్వరుల వివాహమును జూడగలరు. అని ప్రతి యింటిలోని పిల్లవాండ్రు తమరి తల్లి-దండ్రులకు జెప్పుచుండిరి. శివుని గణములను, వాని వేషములను, వారి వారి భాషలను పిల్లల ద్వారా తెలిసికొని నవ్వుచు మీరు భయపడవద్దు. నిర్భయముగ ఉండుడని వారి వారి తల్లిదండ్రులు పిల్లలతో పలికిరి.

ఆడ పెండ్లివారు మగ పెండ్లివారిని ఎదురేగి పురములోనికి దీసికొనివచ్చి సుందరములగు విడిది యిండ్లలోనికి ప్రవేశింప జేసిరి. మేనాదేవి వారికి హారతులనిచ్చి స్నేహితురాండ్రతో గలిసి మంగళగీతములు పాడుట ప్రారంభించినది. సుందరులగు స్త్రీలు బంగారు పళ్లెరములలో సుగంధ ద్రవ్యములు నింపుకొని సంతోష ముతో హారతులు యిచ్చుటకై శివుని యొద్దకు మెనాదేవి తన సఖులను వెంటనిడుకొని వెడలినది. శివుని భయంకరమగు వేష ములను జూచి వారెల్లరు భయపడిరి. ఎవరి యిండ్లకు వారు పోయిరి. మంగళహారతులు లేకయే శివుడు తన విడిది గృహము

నకు చేరినాడు. మేనాదేవి అమంగళ వేషమును ధరించిన శివుని జూచుట వలన మిక్కిలిగ దుఃఖించినదై పార్వతిని దగ్గరకు బిలుచుకొని ప్రేమతో తల నిమురుచు ఒడిలో కూర్చుండబెట్టుకొని నీలకమలములతో సమానమగు రెండుకన్నుల వెంట దుఃఖభరిత ములగు జలముల నింపుకొని పార్వతీ! నీకు బ్రహ్మ యిట్టి సుందరరూపమేల యిచ్చెను? మూర్ఖుడు, పిచ్చివాడు, అశుభ వేషధారియగు ఈ పెండ్లి కుమారుని వివాహమాడుటకేనా? అని ఏడ్వసాగినది. అమ్మా! బ్రహ్మ నీకొరకేల యిట్టి పెండ్లికుమారుని సృష్టించాడు? కల్పవృక్షమునకు కాయవలసిన ఫలములు మేడి చెట్టునకు కాయుటయా? ఇదేమి న్యాయము. నేను నిన్ను వెంట బెట్టుకొని పర్వతముపై నుండి దుమికెదను లేదా అగ్నిలో ప్రవే శించెదను. సముద్రములో పడెదను. కులము నశించినను, అపకీర్తి వచ్చినను నాకిష్టమే. ఈ పిచ్చివానితో నీకు వివాహము జరుగనీయను. అని మేనా దుఃఖముతో పలుకుచుండ అచ్చటకు చేరిన వారెల్లరు జూచి బాధపడసాగిరి. ఆమె కడుపుతీపిచే పలుకు చున్న పలుకులకు ఆ ప్రాంతమంతయు దుఃఖముతో నిండి పోయినది.

అంతటితో మేనా ఆగకుండా యిట్లు పలుకసాగినది. నేను నారదునకు ఏమి అపకారము చేసితిని. నా కాపురమునకు అతడు చిచ్చుపెట్టినాడు. ఆ పిచ్చి పెండ్లికొడుకును బొందుటకేనా పార్వతిని తపము చేయుమని నారదుడు సలహా యిచ్చినది. ఆతనికి మాయా మోహములు లేవు. గౌరవములేదు. సంసారము లేదు. ఉదాసీ నుడు. పరుల యందు ఎల్లపుడు చిచ్చురగుల్గొలుపుచుండును. గొడ్రాలుకు ప్రసవవేదన తెలియనట్లు ఆతనికి సిగ్గు, గౌరవము,

భయము దెలియవు. అని తల్లి పలుకుచుండ ఆ మాటలు పార్వతి విని యిట్లు పలుకసాగినది. అమ్మా నా నుదుట బ్రహ్మ వ్రాసిన వ్రాతను ఎవరుదుడుపగలరు ? నా పూర్వ ఖర్మము ననుసరించి నాకు పిచ్చివాడు వరుడగునని బ్రహ్మ నా నుదుట వ్రాసియున్న పుడు పరులను దూషించి లాభమేమి ? ఆ విధాత వ్రాత చెరుప సాధ్యముగాదు గదా ! దుఃఖపడవద్దు. వివాహ సమయమున దుఃఖింపరాదుగదా ! నా అదృష్టము ననుసరించి సుఖదుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు నా వెంటగ వచ్చును అవశ్యము వానివి అనుభవించవలసినదే. వృథాగా చెడ్డ పేరును దెచ్చుగొనకుము. అని పార్వతీదేవి పలుక అచ్చటజేరిన వారెల్లరు చక్కగా ఆలోచించినవారై బ్రహ్మను దోషిగా భావించి దుఃఖింపసాగిరి.

సప్తర్షులలో నారదుడు వచ్చినట్లు దెలిసికొని హిమవంతుడు వారి వద్ద కెడలి తన గృహమునకు ఆహ్వానించినాడు. వారు వచ్చిన తదుపరి నారదుడు ఆ హిమవంతునకు మేనాదేవికి పార్వతి యొక్క పూర్వజన్మ వృత్తాంతమును దెల్పినాడు. అమ్మా ! పూర్వ జన్మలో మన పార్వతి, జగజ్జనని, భవాని, దాక్షాయణి అని దెలిసి కొనుము. ఈమెకు జన్మలేదు. నాశనము లేనిది. శక్తిస్వరూపిణి పరమేశ్వరుని అర్ధాంగి, ఈమె సృష్టి స్థితి లయకారిణి, తన యిచ్ఛానుసారముగ ఈ శరీరమును ధరించినది. పూర్వము దక్షుని యింట దాక్షాయణిగ పుట్టినది. అప్పుడు ఈమె పేరు సతీదేవి. ఈమె శివునే వివాహమాడినది. ఈ కథావృత్తాంతము

సర్వులకు దెలియును. ఈమె ఒకానొక పర్యాయము శివుని వెంట వెడలుచు కమల బాంధవుడు సూర్యుని వంటివాడు రఘుకుల తిలకుడు శ్రీరామచంద్రుని దర్శించినది. అప్పుడామె మోహితు రాలై శివుని మాటలు లెక్కచేయక అజ్ఞానవశమున సీత వేషము ధరించినది. మాతృదేవతయగు సీత వేషము వేయుటచే శివు డామెను పరిత్యజించినాడు. భర్త వియోగము వలన తండ్రిజేయు యాగమునకు వెడలి యోగాగ్నిచే శరీరము ను భస్మము గావించు కున్నది. ఆమెయే మీ యింట పార్వతిగ జన్మించి శివునే భర్తగా పొందవలెనన్న తలంపుతో కఠోరమగు తపస్సు జేసినది. ఆమె పరమశివునకు సర్వకాలములలో భార్యయె. అని తెలిసికొనుము. సందేహము నొదలుము. అని నారదుడు పలుక వారెల్లరు విని దుఃఖముల, బాధల పోగొట్టుకొనిరి. ఈ శుభవార్త నగరము నాలుగు వైపుల వ్యాపించినది.

నారదుని మాటలకు మేనాదేవి, హిమవంతుడు ఆనందించిరి. వారు పార్వతి పాదములకు పలుమార్లు నమస్కరించిరి. స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, యువకులు, ఆనందించిరి. అనేక విధములుగ మంగళ గీతములు పాడసాగిరి. సువర్ణకలశములు ధరించిరి. ఎవరికి ఏ యే పదార్థములు అవసరమో ఆయా పిండి వంటలు పాకశాస్త్ర నిపుణులచే తయారుచేయించి వారికిచ్చు చుండిరి. జగదంబ జన్మించిన యింటిలో తయారు చేయు పిండి వంటలు గూర్చి ఎవరేమని వర్ణింపగలరు? బ్రహ్మను, విష్ణువును,

ఇంద్రాది దేవతలను సాదరముగ హిమవంతుడాహ్వానించి వారికి ఆయా పదార్థములు వడ్డించిరి. దేవతలు భోజనము చేయుచు ఎంతో ఆనందముగ తమ తమ అర్ధాంగినులతో మృదువగు పలుకులు పలుకుకొనుచు ఒకరినొకరు పరిహాసము చేసికొను చుండిరి. స్త్రీ పురుషులెల్లరు వినోదముతో కాలము గడుపుచుండిరి. భోజనము చేయుట ఆలస్యమైనది. వారికి ఎంత కాలము గడచెనో తెలియలేదు. తదుపరి తాంబూలము సేవించుకొని తమ తమ యిండ్లకు చేరిరి.

సప్తర్షులు హిమవంతునకు లగ్నపత్రికను జదివి వినిపించిరి. వివాహ సమయము సమీపించినది. దేవతలకు వర్తమానము జేసిరి. వారెల్లరు విచ్చేసిరి. వారి వారి అర్హతలననుసరించి ఆసనము లేర్పాటు గావించిరి. సుందరులగు స్త్రీలు మంగళ గీతములు ఆలపింపసాగిరి. ఆ కల్యాణ వేదికను బ్రహ్మ స్వయముగ రచించి నాడు. అద్దాని అందచందములు ఏ కవియు వర్ణింపలేడు. ఋషి పుంగవులకు, శ్రీరామచంద్రునకు నమస్కరించుకొని శివుడు కల్యాణ వేదికపైకి వచ్చాడు. ఆతడు కూర్చున్న తదుపరి పురోహితులు పార్వతిని వివాహ వేదిక వద్దకు తీసికొని వచ్చిరి. ఆమె అందచందములు ఎవరు వర్ణించగలరు ? దేవతలే ఆమెను జూచి ఇటువంటి పెండ్లికుమార్తె ముల్లోకములలో లేదని చెప్పు కొనుచుండిరి మామూలు కవులు పార్వతి అందచందములు

గూర్చి వ్రాయగలరు ? ఆమె శివునకు అర్థాంగి అని దేవతాగణ ములు ఎల్లరు, ఋషులు, మునులు, నాగులు, యక్షులు, కిన్నరులు గంధర్వులు హృదయపూర్వకముగ నమస్కరించుచుండిరి. ఆమె అందచందముల గూర్చి అనంతశేషుడే వర్ణింపజాలడు. ఆమెకు ఆమెయే సాటి. అట్టి పెండ్లికుమార్తె యగు పార్వతిని గూర్చి తులసీదాసు ఏమని వర్ణింపగలడు ?

ఆ సకల గుణసంపన్నురాలగు పెండ్లికుమార్తె శివుడున్న కల్యాణ వేదిక వద్దకు జేరినది. సిగ్గుతో శివుని జూడజాలకుండెను వారిరువురు మునీశ్వరుల ఆజ్ఞానుసారము గణపతిని పూజించిరి వేదములలో చెప్పబడిన విధముగ వారిరువురకు అతివైభవముగ వివాహము జరిగినది. హిమవంతుడు భవాని చేతులు పట్టుకొని శివునికి ఆమెను సమర్పించినాడు. మహేశుడు పార్వతి హస్తము లను పట్టుకొని ఆనందముతో నుండగా దేవతలు, యక్షులు, కిన్నరులు, నాగులు, ఋషులు ఆనందించిరి. పుష్పవర్షమును గురిపించిరి. పురోహితులు వేదమంత్రములు పలికిరి. శివునకు జయ జయ ధ్వానములు పలుకుచుండ వివిధ విధములగు వాద్యములతో కల్యాణ వేదిక ఆనందముతో నిండియున్నది. పార్వతీపరమేశ్వరుల వివాహము జరుగుటచే పదునాలుగు భువన ములలో ఆనందోత్సాహములకు అవధులులేకుండెను. దాసీలను, ఏనుగులను, గుఱ్ఱములను, గోవులను, వస్త్రములను, మణుల, మాణిక్యముల, బంగారుపాత్రల, భోజన సామాగ్రుల బండ్లకు

నింపి హిమవంతుడు కానుకలుగ ఎవరికి గావలసినవి వారి కిచ్చి ఆనందింపజేసినాడు.

శివా ! శంకరా! నీవు పూర్ణకాముడవు. నేను నీకేమి యివ్వ గలను ? నీకు నా సర్వస్వమును సమర్పించుకొనుచున్నాను. అని పలికి సాష్టాంగ నమస్కారము చేసినాడు. మేనాదేవికి గలిగిన ఆనందమును గూర్చి ఎవరేమి చెప్పగలరు ? ఆమె శివునకు నమస్కరించి జగదాధారా ! శివా ! పార్వతి నాకు ప్రాణసము రాలు. ఆమెను నీ దాసీగా భావించి అపరాధములు క్షమింపుము. నా ప్రార్థనను ఆలింపుము. మన్నింపుము. నా కోర్కెను నెర వేర్చుము. అని పలుకు శివుడు మేనాదేవిని ఊరడింపజేసినాడు. హిమవంతుడు మేనాదేవి పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి వెడలినారు. మేనాదేవి పార్వతిని బిలిచి యిట్లు పలుకసాగినది. అమ్మా ! పతియే స్త్రీకి దైవము. ఆతని చరణములను పూజిం చుట స్త్రీ ధర్మము. భర్తకు మించిన దైవము స్త్రీకి లేదు. అని ధర్మశాస్త్రము దెలుపుచున్నది. అని పలుకుచు కన్నుల వెంట ఆనందబాష్పములు రాల్చుచు ప్రేమతో కుమార్తెను హృదయము నకు హత్తుకున్నది.

పార్వతి ఎడబాటును సహింపలేక ఈ ప్రపంచములో బ్రహ్మ స్త్రీ జాతి నెందులకు సృష్టించాడు ? స్వప్నములో గూడా స్త్రీకి సుఖములేదని, వికలురాలైనది. దుఃఖించుటకు యిది సమ యముగాదని భావించుకొని పార్వతిని కౌగలించుకొని ఆమె పాద

ములు పట్టుకొనుచుండెను. మేనా వాత్సల్యము ఊహింపరానిది. పార్వతీదేవి అచ్చట జేరిన స్నేహితురాండ్రనందరిని గలిసినది. తల్లిని సమీపించి ఆలింగనము జేసికొన్నది. అచ్చట జేరినవారెల్లరు పార్వతిని ఆశీర్వదించిరి. తన స్నేహితురాండ్రను పార్వతి శివునకు పరిచయము జేసినది. శివుడు వారి నెల్లరను ఆనందపరచి పార్వతిని వెంట నిడుకొని కైలాసమునకు బయలుదేరినాడు. దేవతలెల్లరు ఆనందించారు. ఆకాశము నుండి పుష్పవర్షమును గురిపించినారు. వివిధ విధములగు వాద్యములు ప్రయోగింపసాగెను. మైనా హిమవంతులు మేనాదేవి హిమవంతులు పార్వతీ పరమేశ్వరులను సాగనంపిరి. వారు కైలాసమును జేరిరి. దేవతలు తమ తమ లోక ములకు జేరిరి. కొంత కాలమునకు ఆ పార్వతీ పరమేశ్వరులకు కుమారస్వామి జన్మించాడు. అతడే తారకాసురుని సంహరించాడు. వేదములు, పురాణములలో కుమారస్వామిని గురించి మిక్కిలిగ వర్ణింపబడినది. తులసీదాసుగారు ఆ పార్వతీ పరమేశ్వరుల కల్యాణమును, కుమారస్వామి జననమును గూర్చి ఏమి వ్రాయ గలడు ? సర్వులకు దెలియుటకై సంక్షేపముగా మాత్రమే వ్రాసితి నని పలికినాడు.

ఈ పార్వతీ కల్యాణము నెవరు చదివెదరో, చెప్పెదరో, కీర్తించెదరో, వినియెదరో అట్టి వారికి సర్వవిధముల అష్టైశ్వర్య ములు పొందుదురని, శుభములు గలుగునని శ్రీ గోస్వామి తులసీ దాసుగారు చెప్పుచున్నారు

41-13

శ్రీరామ చరితాంతర్గత శ్రీ శ్రీ శ్రీ గోస్వామి తులసీదాసుచే రచింపబడ్డ పార్వతీకల్యాణము సంపూర్ణము.

శ్రీ సీతారామాంజనేయార్పణమస్తు

శ్రీ పార్వతీ పరమేశ్వరుల పాదపద్మములకు

❋ స మ ర్ప ణ ❋



# ఈ గ్రంథ ముద్రణకు సహాయమొనరించిన
## దాతలు

| | |
|---|---|
| శ్రీ యరబర్ల బ్రహ్మయ్యగారు, అయినంపూడి -కృష్ణా జిల్లా | 116-00 |
| శ్రీ శశిప్రావిజన్సు, గంగానమ్మపేట, తెనాలి. | 116-00 |
| శ్రీ మద్ది ధనుంజయరావు, గుంటూరు. | 116-00 |
| శ్రీ యక్కల వెంకట సుబ్బయ్య గారు, తెనాలి. | 116-00 |
| శ్రీ యం. రాధాకృష్ణ గారు, తెనాలి. | 100-00 |
| శ్రీ R. R. L. S. నరశింహారావు గారు AE టెలికం ఆఫీసరు, గుంటూరు. | 58-00 |


Phone : Ladge 21330
Resi 24247
24217

శుభాకాంక్షలతో

## శ్రీ హనుమాన్ లాడ్జి

స్టేషన్ రోడ్ – గుంటూరు

---

శుభాకాంక్షలతో

## అన్నవరపు శిల్క్స్ A/C

ప్రత్యేక మహిళా విభాగము

మఫత్ లాల్ షోరూం

బోస్‌రోడ్ – తెనాలి.

మా వద్ద కంచి, ఆరణి, ధర్మవరం, బెనారస్, బెంగాలి, సరితా, కరిష్మా. కాటా, బెంగాలీ లభించును.

జాకెట్ మ్యాచింగ్ మా ప్రత్యేకత.

